అడ్మిషన్లు జరుగుచున్నవి ! త్వరపడండి ! !

స్థాపితం : 1984

Phone : 429




# శ్రీ సత్యసాయి విజ్ఞాన్ విహార్

ఇంగ్లీషు & తెలుగు మీడియం రెసిడెన్షియల్

జగ్గయ్యపేట – 521 175 కృష్ణాజిల్లా

* L. K. G. నుండి 10 వ తరగతి వరకు
* ప్రభుత్వం నిర్వహించు కామన్ మరియు పబ్లిక్ పరీక్షలందు 100% ఫలితాలను అందించుచున్న సంస్థ
* ఆధునిక పద్ధతులలో ఆడియో, వీడియో సహాయముతో ఉత్తమ శిక్షణ
* మానవతా విలువలను "బాలవికాస్" తరగతుల ద్వారా బోధించుట
* అనుభవజ్ఞులైన అధ్యాపకవర్గం, చక్కటి హాస్టల్ వసతి కలదు.
* శ్రీ సత్యసాయి విద్యాసంస్థల నిర్వహణ తీరు ననుసరించి చక్కటి ఆటపాటలతో, యోగాభ్యాసములతో, నీతిబోధనలతో పిల్లలను పరిపూర్ణమైన ఆరోగ్యవంతులుగా, విద్యావంతులుగా, చక్కటి భావిభారత పౌరులుగా తీర్చిదిద్దుట మా లక్ష్యము.
* అప్లికేషన్ & ప్రాస్పెక్టస్ ఫారము కావలసినవారు రు. 15/-లు D.D. శ్రీసత్యసాయి విజ్ఞాన్ పేర వ్రాసి పంపగలరు.
* వచ్చే విద్యాసంవత్సరంనుండి మా విద్యాసంస్థ స్వంత ప్రాంగణములో నడపబడుచున్నదని తెలియజేయుటకు సంతసించుచున్నాము.

ఇట్లు

K. Ramakrishna Rao

M. A., B. Ed.,

( Old Student of Bhagavan's College
Brundavan, Bangalore )

# శ్రీవాణి

సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకుడు: కొమరగిరి కృష్ణమోహనరావు

జూలై 1993

సంపుటి : 9

సంచిక : 7



మేనేజర్

కొమరగిరి చంద్రశేఖర్

24-52, రామానాయుడు పేట

మచిలీపట్నం-521 001

ఫోన్ : 2818


| | | |
|---|---|---|
| విడి ప్రతి | : రు. | 4-00 |
| సంవత్సర చందా | : రు. | 48-00 |
| 4 సం॥ల చందా | : రు. | 175-00 |
| జీవిత సభ్యత్వం | : రు. | 600-00 |
| పోషకులు | : రు. | 1,116/- |

Cheques Drafts should be drawn in favour of SREE VANI, Monthly Machilipatnam


EDITED, PRINTED & PUBLISHED BY

**Komaragiri Krishna Mohan Rao**

Printed at

SREE VANI PRINTERS

MACHILIPATNAM


## విషయసూచిక



ముఖచిత్రం :

త్యాగశీలి దధీచి మహర్షి

ప్రశాంతి నిలయ సంఘటన విశ్లేషణ



# "తెరను దాగిన సత్యంబు తెలిసికొనగ విశ్రమింపక నాతోడ వెడలిరండు"

సత్య ధర్మ శాంతి ప్రేమలు విశ్వశాంతికి మూలమంటూ దివి నుండి భువికి దిగివచ్చిన పర్తీశ్వరుని మందిరం అది అదే ప్రశాంతి నిలయం. దివ్యప్రేమ ధామం శాంతిప్రేమలకు నిలయం అటువంటి ప్రేమ పరిమళాలను విరజిమ్ముతున్న ప్రశాంతినిలయంలో

కొమరగిరి కృష్ణమోహనరావు

జూన్ 6వ తేది కాళరాత్రిన ముష్కరుల కరాళ నృత్యంతో శాంతికి భంగం వాటిల్లి, ప్రశాంతిభగ్నమై అశాంతికి లోనైపోయింది పరమ పునీతమైన భగవాన్ సాయి శయన మందిరం ముష్కరుల కలుషితరక్తంతో అపవిత్రమైపోయిన కాళరాత్రి అది.

"సత్యమే నా ప్రచారం. ధర్మమే నా ఆచారం, శాంతియే నా స్వభావం, ప్రేమయే నా రూపం" అని బాబా బోధిస్తున్న సత్య ధర్మ శాంతి, ప్రేమలు సనాతన ధర్మసౌధానికి నాలుగు స్తంభాలు. అవే ఉత్తమ మానవత్వ విలువలు. ఈ నాల్గింటి సమ్మిళిత స్వరూపమే అహింస. కనుక "సత్య ధర్మ శాంతి ప్రేమ అహింసలు పంచ ప్రాణాలుగా విశ్వసించాలి" అంటారు బాబా ఈ పంచ ప్రాణాలు మూర్తీభవించిన ప్రేమమూర్తి సమక్షంలోనే ఇం. దారుణం జరిగటమా? అని లక్షలాది మంది భక్తులు ఆవేదనను వెలిబుచ్చుచున్నారు. అసలు విషయం అర్థం కాక అయోమయంలో కొట్టుమిట్టాడుతున్నారు. భగవాన్ బాబా ఆదేశాలను పాటిస్తూ మానవాళికి సేవ చేస్తున్న భక్తులు వేదన చెందుచున్నారు, ఆవేదన పడుతున్నారు. బడబాగ్ని బ్రద్దలైనట్లు, వారి హృదయాలు బ్రద్దలై తల్లడిల్లిపోతున్నారు అసలు ఇంత దారుణం జరగటానికి కారణమేమిటి?

తరాలు తరలినా
యుగాలు దొరలినా
మనిషి బుద్ధి మారలేదు
మమత సమత పెరగలేదు
మనసు లేదు...మమత లేదు
ప్రేమ లేదు ... కరుణ లేదు
చూడలేదు ... ఓర్వలేదు
కోపమెక్కువ, తాప మెక్కువ
మనిషి బుద్ధీ మారలేదు.

ఒక మనిషి బాగుపడుతుంటే ఓర్వలేనివారు ఎందరో...ఒక వ్యక్తి పైకి వస్తుంటే అసూయ చెందేవారు మరెందరో...అదే విధముగ ఒక సంస్థ మంచి పనులు చేస్తూ ప్రజలచేత మెప్పును పొందుతుంటే ఓర్వలేని సంస్థలు ఎన్నో...ఒక సంస్థ నిస్వార్థబుద్ధితో సమాజసేవ చేస్తూ ప్రజల ప్రశంసల నందుకుంటుంటే అసూయపడే సంస్థలు మరెన్నో...ఈనాడు సరిగా ఇదే జరిగింది కుగ్రామమైన పుట్టపర్తి భగవాన్ సాయి సంకల్పంతో, వారి దివ్యశక్తితో వెలుగు చూచింది నేడు అది ప్రపంచానికే ఆరాధ్యకేంద్రమైంది సనాతన ధర్మసౌధానికి పునాదిరాయిగా నిలిచింది. యావత్ ప్రపంచ మానవాళి నేడు పుట్టపర్తికి తరలి వస్తున్నది. భగవాన్ బాబా సందేశాలు విని ఉత్తేజులై

స్వామికి పాదాక్రాంతులవుతున్నారు. కొంతమంది ఉదార వదాన్యులు భగవాన్ చేస్తున్న మంచి పనులకు ఆకర్షితులై కోట్లాది రూపాయలు సమర్పించుకుంటున్నారు యావత్ ప్రపంచం భగవాన్ సాయి ఛత్రం క్రింద సేద తీసుకొనే రోజు ఆసన్నమవుతున్నది ఈ పురోభివృద్ధిని చూచి ఓర్వలేక, అసూయచెంది, ఈ సాయి సంస్థను ఏదోవిధంగా అప్రదిష్టపాలు చేయటానికి పన్నిన కుట్రలో ఇది ఒక భాగం మాత్రమే

ఈ కుట్రియొక్క స్వరూప స్వభావాల జోలికి నేను పోదలచలేదు పూర్వాపరాలను గురించి విమర్శించి వ్రాయదలచలేదు కారణం? 1 ఈ కుట్రను గురించిన దర్యాప్తు ప్రభుత్వం చేపట్టింది 2 ఈ కుట్రకు సంబంధించిన విషయాలనుగురించి మరియూ సంబంధం లేని ఎన్నో విషయాలను గురించి కూడా పత్రికలు ఏకరువు పెడుతూనే ఉన్నాయి. 3 కొన్ని పత్రికలు ఈ కుట్రి వెనుకనున్న అదృశ్య హస్తాలను బహిర్గతం చేయటానికి తమ శక్తిని, యుక్తిని ప్రదర్శిస్తుంటే, మరికొన్ని పత్రికలు సమయం వచ్చిందికదాయని బాబా మీద బురద చల్లటానికి ప్రయత్నాలు చేస్తున్నాయి. మరల అవే విషయాలు వ్రాసి శ్రీవాణి పాఠకులను విసిగించదలచలేదు.

మన మాటలు, మన చేతలు, మన వ్రాతలు మంచిని పెంచటానికి, పెంచిన మంచిని పదిమందికి పంచటానికి ఉపయోగపడాలిగాని మంచిని త్రుంచటానికి, పదిమందికి ఉపయోగపడే సంస్థలనూ, వ్యక్తులనూ కూలదోయడానికి కారణభూతం మాత్రం కాకూడదు. ఈనాడు బాబా విద్యా వైద్య రంగాలలో ఎనలేని కృషిని కొనసాగిస్తున్నారు కె జి నుండి పి జి. వరకు ఉచితంగా విద్య గరిపే సంస్థ ( ఒక్క సాయి సంస్థ తప్ప ) ప్రపంచంలోనే వేరొకటి లేదేమో ! అదే విధంగా గుండె శస్త్రచికిత్సలు, మూత్రపిండాల మార్పిడి ఉచితంగా చేసే వైద్య సంస్థ (సాయి ఆసుపత్రి తప్ప) కూడా మరొకటి లేదేమో ! ఈ బృహత్తర సంస్థలు ఎవరికోసం నెలకొలిపారు ఈ బాబా ? దేనికోసం ఇంత పెద్ద ప్రయత్నం చేస్తున్నారు ? ఆత్మ విమర్శన చేసుకొనేవారికి మాత్రమే దీనిలోని సత్యం బోధపడుతుంది, అర్థమవుతుంది.

ఈ మధ్య ఈ దారుణం జరిగిన తరువాత కొంత మంది మిత్రులు నన్ను కలిశారు జరిగిన సంఘటనను గురించి ప్రస్తావించి బాధపడ్డారు. అప్పుడు ఒక వ్యక్తి ఊహించని రీతిలో విమర్శన చేశాడు "బాబా స్మగిలింగ్ చేస్తున్నాడు మూత్రపిండాలను, కండ్లను Export చేస్తున్నాడు దానిని తెలుసుకొని విద్యార్థులు బాబామీద తిరుగబడ్డారు" అన్నాడు. ఆనాడు నా మనస్సువికలమై పోయింది ఈషన్మాత్రం స్వార్థమే ఎరుగని త్యాగశీలి మీదనా ఈ విమర్శ ? తనను ఆరాధించే వారి మీదనే కాక, తనను విమర్శించేవారిమీద కూడా ప్రేమను ప్రవహింపజేస్తున్న ప్రేమమూర్తి మీదనా ఈ విమర్శ ? లక్షలాది రూపాయలు వెచ్చించి గుండె శస్త్రచికిత్సలు చేయించుకోలేక ప్రాణాలనే కోల్పోతున్న నిర్భాగ్య అభాగ్యులకు ప్రాణభిక్షను ప్రసాదించటానికి ఏర్పాటు చేసిన సూపర్ స్పెషాలిటి హాస్పిటల్‌ను ఏర్పాటుచేసిన 'ప్రాణదాత' మీదనా ఈ విమర్శ ? ఆలనాడు శ్రీరామునికి, శ్రీకృష్ణునికి భార్యా పిల్లలుఉన్నారు. (ఈ భగవాన్ సాయికి భార్యా పిల్లలు కూడా లేరే!) ఏ స్వార్థమూలేని సర్వసంగపరిత్యాగిమీదనా ఈ విమర్శ ఈనాడు సమాజం ఎంత పతనమైపోయిందో, మనిషి ఏస్థాయికి దిగజారాడో ఈ కువిమర్శనలే ఒక తార్కాణం. ఈ హాస్పిటల్ నెలకొలిపిన తరువాత 800 మందికి పైగా ఉచితంగా గుండె ఆపరేషన్లు చేయబడినాయి కొంత మంది ప్రయివేటు డాక్టర్లకు, కొన్ని ప్రయివేటు నర్సింగ్‌హోములవారికి ఎంతో కొంత రాబడి కూడా తగ్గింది అయితే ఎంతోమంది పేద ప్రజలకు ప్రాణ

( తరువాయి 41 వ పేజీలో )

శ్లో॥ కిం మండనం . సాక్షరతాముఖస్య
సత్యంచకిం? భూతహితం సదైవ
కిం కర్మ కృత్వా నహి శోచనీయం?
కామారి కంసారి సమర్చనాఖ్యం॥




ఏ మనిషైనా తాను అందంగా కనబడాలని అనుకోవటం సహజం. దానికోసమని కృత్రిమమైన అలంకారాలెన్నో దిద్దుకుంటాడు ముఖానికి చక్కగా పౌడరు రాసుకుంటాడు సుగంధద్రవ్యాలను పులుముకుంటాడు. జుట్టును రకరకాలుగా దువ్వుకుంటాడు విలువైన వస్త్రాలు ధరిస్తాడు వింత వింత సొగసులకోసం ఆరాటపడతాడు. ఈ విషయంలో స్త్రీలు మరీను. వాళ్ళ చీరలు గాని, నగలు గాని, సుగంధద్రవ్యలేపనాదులు గాని, కేశాలంకారాలు గాని వాళ్ళ అందాలను తీర్చి దిద్దటానికి అనేక తీరుల్లో వస్తూండటం అందరికీ తెలిసిందే.

అయితే యివేవీ నిజమైన అలంకారాలు కావట. తరగనిది, చెరగనిది అయిన అలంకారం ఆడకైనా మగకైనా ఒకటే అదే సాక్షరత అంటే నాలుగక్షరం ముక్కలు నేర్వటం.

చదువు ప్రతి మనిషి ముఖానికీ అందం తెచ్చిపెడుతుంది. సభ్యతను సంస్కారాన్ని కలిగిస్తుంది కనుక అందరూ విద్య నేర్వాలి దానికి చిన్నా పెద్దా తేడా లేదు. జ్ఞానంకోసం అందరూ అర్హులే కనుకనే వయోజన విద్యాప్రచారం జోరుగా సాగుతోంది అలాగే సత్యమైనది యేది అని అడిగితే రకరకాల సమాధానాలు వస్తాయి. కానీ శాశ్వతమైనదనే అర్థంలో చెప్పాలంటే సర్వ ప్రాణులకు మేలు చేయటం తప్ప మరొకటిలేదు పరోపకారానికి వున్న ప్రాధాన్యం మరోదానికి లేదు. కనుకనే వాల్మీకి రాముణ్ణి వర్ణిస్తూ " సర్వభూత హితే రతః " అని అంటాడు సర్వ ప్రాణుల హితాన్ని కోరటమే రాముని లక్షణం.

లోకంలో కొన్ని చేయదగినవి, అలాగే చేయగూడని పనులు వున్నాయి ఎవరూ ఎన్నడూ చేయగూడని పనులు కూడా వుంటాయి. అలాంటి చేయగూడని పని చేసినప్పుడు "అయ్యో ఎంత పని చేశాం" అని విచారపడి బాధపడటం జరుగుతుంది కాని ఎవరైనాసరే ఎప్పుడైనాసరే చేసిన దానిని గురించి విచారించవలసిన, లేక బాధపడవలసినపనే లేనిది ఒకటి వుంది అదే శివ కేశవ సమర్చనం

అంటే శివునిగాని విష్ణువునిగా పూజించటమనేపనే శోచింపదగినదికాదు. పైగా మంచి పని చేశామని సంతోషింపదగినదే. ఏభక్తి లేకపోతే బాధపడాలి కాని, భక్తి కలిగివుండటానికి విచారించనక్కర్లేదు. అందరికీ కావలసినది వుత్తమ గుణం. దీన్నిబట్టి మనకర్థమయ్యేదేమంటే – ప్రతి మనిషికీ ఏ కొంచెమైనా భక్తి వుండాలి. చదువుసంధ్యలు కావాలి, భూతదయ వుండాలి. అని ○

చందాలను సకాలంలో రెన్యూవల్ చేసి, క్రొత్త చందాదారులను చేర్పించి, ఉత్తమ విలువలు గల
శ్రీవాణి మాస పత్రికను రాబోయే తరాలకు అందించే అవకాశం కల్పించండి
ఉత్తమ సాహిత్యానికి మీవంతు తోడ్పాటు నందించండి. – సం॥

# 'త్యాగశీలి' దధీచి మహర్షి

ఎ. ఎస్. అవధాని

అది పవిత్ర సరస్వతీ నదీతీరంలో ఉన్న ఒక మహర్షి ఆశ్రమం. ఫల పుష్పాదులు ఉన్న వృక్షాలతో అత్యంత సుందరంగా ఉంది. ఆ ఋషి తపః ప్రభావంవలన సహజ వైరం గల జంతువులు కూడా నిర్భయంగా స్నేహ భావంతో విహరిస్తున్నాయి. ప్రజ్వలిత వైదికాగ్నిముందు, మహర్షి, తేజోమూర్తియై కూర్చున్నాడు. పతివ్రత, పరమసాధ్వి అయిన ఆయన ఇల్లాలు సపర్యలనందిస్తోంది. దివ్యతేజోమూర్తులయిన పురుషులు గుమిగూడి, దీన వదనాలతో ఆ మహర్షిని సమీపించి, నమస్కరించారు. వారి రాకతో అమితానందాన్ని పొందిన మహర్షి వారిని ఆహ్వానించి, ఆసీనులను చేసి, కుశలమడిగి "ఏమిపనిమీద దయచేసారని" ప్రశ్నించాడు.

"మాకు అసురుల వలన ఆపద కల్గింది. వారిధాటీ తాగలేక ఇల్లు, వాకిలి, వదిలి, తిరుగుతున్నాము. శ్రీమహావిష్ణువు ఇచ్చిన సలహామేరకు, మీ వద్దకు వచ్చాము. అసురులను గెల్చుటకు మాకొక్కటే మార్గమని విష్ణువు చెప్పారు".

"ఏమిటది ?" అన్నాడు మహర్షి.

"అదే ! చెప్పటానికి సంకోచంగా ఉంది"

"సంకోచమెందుకు ? నిర్భయంగా చెప్పండి"

"మాకు మీ వెన్నెముకతో సహా మీ అస్థికలన్నీ కావాలి. వాటితో విశ్వకర్మ ఆయుధాలను తయారు చెయ్యాలి. వాటి ఆధారంతో గాని ఆ అసురుల నాయకుడు పరాజితుడు కాడు. మీరు మమ్మల్ని అనుగ్రహించాలి" అని దీనంగా వేడుకున్నారు.

"అంటే ! నా శరీర త్యాగం చెయ్యాలన్నమాట!"

"అవును స్వామీ ! అందుచేతనే నోరు తెరచి అర్థించలేక తడబాటు పడుచున్నాము"

"ఈమాత్రానికి తడబాటెందుకు? జన్మించిన శరీరధారి ఏదో ఒకనాడు మరణించవలసిందేగదా ! శరీరాన్ని వదలాల్సిందేగదా ! ఆ శరీరంలోని ఎముకలు పరోపకారానికుపయోగపడటం కంటె కావల్సిందేముంది ? కొద్ది నిముషాలలో, యోగమార్గంలో నా శరీరాన్ని విడుస్తాను. మీ కోర్కెను నిరభ్యంతరంగా నెరవేర్చుకోండి"—

ఇలా సంభాషణ సాగింది. ఎవరీ మహర్షి? ఎందుకుగా ఇంతటి త్యాగానికి సంసిద్ధుడైనాడు ? ఆ అర్థిస్తున్న దివ్య పురుషులెవ్వరు ? వారికొచ్చిన ఆపద ఏమిటి ? లోకంలో ఎన్నడూ, ఎవ్వరూ, కోరని, యీ విపరీత కోరికనెలా కోరారు ? అంతా ఆశ్చర్యంగా ఉంది కదూ !

ఆయనే మహా తపోజనిత తేజస్సంపన్నుడైన దధీచి మహర్షి. ఆ అర్థిస్తున్నది, దేవతల రాజైన మహేంద్రుడు, అతని అనుచరులు. వారికి వచ్చిన ఆపదా వృత్రాసురుని వలన, ఈ సంఘటన పూర్వాపరాలను తెలుసుకుందాం.

చాలా కాలం క్రిందట, గొప్ప తపోశక్తిగల అధర్వణ మహర్షి వుండేవారు. ఆయన వద్ద అనేకులు వేద, వేదాంగములధ్యయనం చేస్తూండేవారు. బ్రహ్మవిద్య నభ్యసించేవారు. ఆశ్రమ నిర్వహణలో ఆయనకు సహకరిస్తూ ఉండేది భార్య శాంతి. వారికి ముగ్గురు పుత్ర సంతతి కల్గింది. వారి పేర్లు ధృతవ్రత, దధీచి. అధర్వశిర. వారికి యోగ్యమైన వయస్సులు రాగానే ఉపనయనం చేసి, గురుకులవాసానికి పంపారు తండ్రి

దానిని జయప్రదంగా ముగించుకున్న దధీచి, ఇంద్రు నుద్దేశించి, తీవ్రి తపస్సు చేశాడు. ప్రత్యక్షమైన ఇంద్రుడు "ఏమి కావాలి?" అని అడిగాడు,

## శిరస్సు తెగుతుందని తెలిసి, బ్రహ్మవిద్యను బోధించిన మహర్షి :

"బ్రహ్మమును గురించి తెలుసుకోదల్చాను".

ఇంద్రుడు సంతోషించి. "అలాగే చెబుతాను. కాని యీ దేవరహస్యం నీలోనే ఉండాలి. ఎవరికీ చెప్ప రాదు. దీనిని ఉల్లంఘిస్తే, నీ శిరస్సు ఖండిస్తాను జాగ్రత్త!" అని హెచ్చరించాడు. అందుకంగీకరించి బ్రహ్మజ్ఞానాన్ని స్వీకరించాడు దధీచి.

ఇంద్రత్వ మొక పదవి. నూరు అశ్వమేధ యజ్ఞాలుగాని, మహాతపస్సులుగాని, చేసినవారికి ఆ పదవి పొందే అర్హత వస్తుంది. అలా ఎవరు ఎవరిగి వచ్చి, తన పదవికి ముప్పు పెడతారోనని ఇంద్రునకు ఎప్పుడూ భయమే. అందుకే ఆ ప్రయత్నాలకు అనేక విధాల విఘ్నాలు కల్పించటానికి, ఆయత్తమవుతూ ఉంటారు. ఇప్పుడీ షరతు ఆ కారణంగానే విధించాడు.

బ్రహ్మజ్ఞానం పొందిన దధీచి, సరస్వతీ నదీ తీరంలో ఆశ్రమం నిర్మించుకుని స్థిరపడ్డారు ప్రాతితేయి (గభస్తిని) అన్న ఆమెను వివాహం చేసుకున్నాడు. అనేకులు ఆయన పాదాల నాశ్రయించి, వేద విద్యల నభ్యసిస్తూ ఉండేవారు. ఒకసారి దేవవైద్యులయిన, అశ్వనీకుమారులు వారి ఆశ్రమానికి వచ్చి బ్రహ్మవిద్య నుపదేశించమని అర్థించారు. అందుకాయన సిద్ధపడి, ఇంద్రుడు పెట్టిన ఆంక్షను వారికి చెప్పి "నేను యీ విద్య నుపదేశించిన, నా శిరస్సు ఇంద్రుడు ఖండిస్తాడు" అన్నాడు. అది విన్న అశ్వనీకుమారులు (కవలలు) "శల్య, శలాక విద్యలో మేము నిపుణులము ఇంద్రునికి ఖండించటమే తెలుసు. మాకు అతకటంకూడా తెలుసు మీకే ఆపదరానీయము. ముందుగా మీ శిరమును మేమే మార్చి, అశ్వపు ముఖాన్ని అతికిస్తాము. మీరు బ్రహ్మ విద్య మాకు చెప్పగానే ఇంద్రుడు వచ్చి మీ శిరాన్ని ఖండించనివ్వండి. ఆ వెనువెంటనే మేము మీ నిజ శిరస్సును తిరిగి మీ శరీరానికి అతికించగలము. ఈ శస్త్రవిద్యలో మేమత్యంత నిపుణులము" అన్నారు. అందుకు సంతోషించిన దధీచి మహర్షి వారికి బ్రహ్మ విద్యాజ్ఞానాన్ని బోధించాడు. భావించిన రీతిగానే శిరస్సు తెగుట, తిరిగి అతికించుట యథావిధిగా జరిగిపోయినాయి ధర్మ నిర్వహణలో ఎంతటి సాహసానికైనా వెనుదీయ డని దధీచి మహర్షి ఘనకీర్తి నార్జించాడు.

## బృహస్పతిని అవమానించిన ఇంద్రుడు: విశ్వరూపుని హతమార్చుట

ఒకసారి ఇంద్రసభకు దేవ గురువగు బృహస్పతి వచ్చాడు. గురువుగారు రాగానే నిలబడి స్వాగతము చెప్ప దేవేంద్రుడు ఆనాడు, అధికార గర్వంతో కన్ను మిన్ను గానక ఆసనమునుండి లేవనే లేదు గురుని వంక చూడనైనా లేదు. పైగా ప్రక్కనే ఆసీనురాలైన తన సతీమణి శచీదేవి భుజముపై చేయివేసి, దర్పంతో కాలూపుతూ కూర్చున్నాడు. ఇంద్రుని యీ ప్రవర్త నకు కినుక వహించిన బృహస్పతి, గిరుక్కున తిరిగి సభ వదలి వెళ్ళిపోయాడు. ఆ దరిమిలా దేవతల కాయన కనిపించలేదు, కొంతసేపటికి, దేవేంద్రునికి పశ్చాత్తాపం కలిగి, "అయ్యో! గురువు నవమానించానే! ఏ అనర్థం వాటిల్లుతుందో" అని వణకిపోయాడు.

దేవతలకు గురువనుగ్రహం తొలగిందని తెలుసు కున్న అసురులు, తమ గురువగు శుక్రాచార్యుల వద్ద కేగి, యీ అదనుపయోగించుకుని, దేవతలను పరాజితు లను చేయనుత్సాహం కనపర్చారు. ఆయన ఆమోదం తెలపగానే, అమరావతి పట్టణాన్ని ముట్టడించారు. గురువనుగ్రహాన్ని పోగొట్టుకున్న దేవతలు, తేలికగా పరాజితులైనారు. స్వర్గాన్ని విడిచి పారిపోయారు ఇంద్రుని గర్వమే వారిస్థితికి తెచ్చింది.

దేవతలందరు, ఇంద్రుని ముందుపెట్టుకుని, లోక పితామహుడైన బ్రహ్మ వద్దకు వెళ్ళి, దీనులై తలలు

వంచుకుని, తమ ఇక్కట్లను ఏకరువు పెట్టారు. "సాక్షాద్భగవత్స్వరూపుడగు బృహస్పతిని అనుభవించి నందుకు తగిన ఫలితాన్ననుభవించారు. ఆయన తిరిగి ప్రసన్నుడయ్యే పర్యంతము, మరొక యోగ్యుడు, తపస్వి, బ్రహ్మజ్ఞాని యగు బ్రాహ్మణుని పురోహితునిగా ఏర్పర్చుకోండి" అన్నాడు బ్రహ్మ.

"అట్టి యోగ్యులెవరో తమరే సెలవివ్వండి"అన్నారు దేవతలు. "కశ్యప మహాముని కుమారుడు త్వష్టముని, ఆయన కుమారుడు విశ్వరూపుడు అన్ని విధముల తగిన వాడు. అయితే ఒక విషయముంది. త్వష్టముని భార్య, విశ్వరూపుని తల్లి అసుర వంశానికి చెందినది ఆ కారణంగా అసురులపట్ల విశ్వరూపునికి లోలోన అభిమాన ముండవచ్చు దానిని మీరు సహించాలి"

ఈ మాటలు విన్న దేవతలు, ఇంద్రుని నాయకత్వంలో విశ్వరూపుని కలసి, తమ పురోహితుడుగ వ్యవహరించమని అర్థించారు విశ్వరూపుడు ముందుగా అంగీకరించలేదు. పౌరోహిత్యము తనకు సరిపడని పని అన్నాడు. అయినా దేవతలు తమ పట్టు వీడక పదే, పదే, ప్రార్థించటంతో అంగీకరించి, వారి పదవులు తిరిగి వారికి వచ్చేట్లుగా సహాయపడగలనని మాట ఇచ్చి, ఇంద్రునకు నారాయణ కవచమును ఉపదేశించాడు. దాని ప్రభావం వలన దేవతలు అసురులను గెలిచి తమ రాజ్యాన్ని తిరిగి పొందారు, విశ్వరూపుని గౌరవ ప్రతిష్ఠలు ఇనుమడించాయి. దేవతలంతా అతని కనుసన్నల మెలగజొచ్చారు.

ఇది గిట్టని అసురులు, త్వష్ట మహాముని భార్యవద్దకు చేరి "అమ్మా! మీ తనయుడు విశ్వరూపుడు దేవతల గురువయినందుకు మాకూ సంతోషమే. కాని, విధి నిర్వహణలో, కేవలము దేవతలనే కాకుండా, మమ్మల్ని గూడ ఒక కంట కనిపెట్టమని మీరు అతనిని ఒప్పించాలి" అని ప్రాధేయపడ్డారు. ఆమె అందుకు ఒప్పుకుని, నమస్కారం చేయదలచి వచ్చిన విశ్వరూపునితో ఈ మాత్రం సహాయం అసురులకు చేయమని" సూచించింది. "ఏమి చేయమంటావు తల్లీ" అడిగాడు విశ్వరూపుడు. "నీవు! 'స్వాహా' మంత్రాలనుచ్చరించేటప్పుడు, ఉచ్చైశ్శ్వరంలో దేవతల పేర్లు చెప్పి, నెమ్మదిగా లోలోన అసురుల పేర్లుగూడ చెప్పు వారికి కూడ భాగములు కల్పించు" అన్నది. విశ్వరూపుడు తల్లి ఆజ్ఞను పాటించి వ్యవహరించసాగారు. దేవతల కనుమాన మొచ్చింది. ఇందు మన అసురులు మరల బలవంతులై తమ పైకి చెలరేగుతారేమో అన్న భయం వచ్చింది. ఈ విషయాన్ని పసిగట్టిన ఇంద్రుడు, తనకు నారాయణ కవచమిచ్చి రక్షించని గురువనికూడ సందేహించక ధ్యాననిమగ్నుడైయున్న విశ్వరూపుని శిరాన్ని నిర్దాక్షిణ్యంగా తెగవేసాడు

ఈ విషయం తెలిసిన త్వష్టముని, పుత్ర మరణ శోకంలో మునిగిపోయి, "ఈ ఇంద్రుడెంత నీచుడు. నా పుత్రుని మోసగించి తీసుకుపోయి, గురువుగా ఏర్పరచుకుని, అన్ని పనులు చేయించుకుని, నారాయణ కవచ దీక్ష పొంది, అసురులను జయించి చివరి కాతని, ఏమరుపాటుగా ఉన్నప్పుడు హతమార్చాడు. ఎంత విశ్వాస ఘాతకుడు! ఎంతటి నీచకార్యాని కొడిగట్టాడు. దీనికి తగిన ప్రతిఫలాన్నందిస్తాను. ఇంద్రుణ్ణి చంపగల పుత్రునావిర్భవింప చేస్తాను. అని తీవ్ర క్రోధావేశంతో యజ్ఞాన్ని సంకల్పించారు.

## వృత్రాసురుని ఆవిర్భావం – మంత్రాల ప్రభావం

మంత్రప్రభావం అమోఘం. ఉపాసనా బలంచే అనుకున్నది సిద్ధిస్తుంది. తన సంకల్ప బలంచేత త్వష్టముని వృత్రాసురుని ఆవిర్భావానికి కారణమయినాడు. అతడొక భయంకరమైన విశాలకాయుడు అయితే భగవద్భక్తుడు. అతి బలశాలి. పుట్టగానే తండ్రిని అడిగాడు "తండ్రీ! మీరు నన్ను ఎందుకు పుట్టించారు? నా వలన మీకేమి సహాయం కావాలి?" "వత్సా! అమరాధిపుడు, మహేంద్రుడు నీ అన్నను అన్యాయంగా

సంహరించారు. దానికి ప్రతీకారం నీవు తీర్చుకోవాలి" అనగానే, అసురులకు నాయకత్వం వహించి, వృత్రాసురుడు స్వర్గం పైకి దండెత్తాడు. దేవతలు యుద్ధానికి సిద్ధమయినారు వారి అస్త్ర, శస్త్రాలన్నీ వజ్రశరీరుడుగానున్న వృత్రాసురుని గాయపరచలేక పోయినాయి. అంతేగాదు, పర్వతగుహవలెనున్న నోరు తెరచి, దేవతల సమస్త అస్త్ర, శస్త్రాలను మింగేశాడు. పరాజితులైన దేవతలు శ్రీమన్నారాయణుని స్తుతించ సాగారు. సంతుష్టుడైన శ్రీమహావిష్ణువు ప్రత్యక్షమై వారి కోరిక నడిగి తెలుసుకొని –

" వృత్రాసురుడు మహా తేజస్వి. ధర్మాత్ముడు పైగా నా భక్తుడు. అతనిని నేను చంప వీలులేదు. అయినా వానిని చంపే ఉపాయం చెప్తాను వినండి. మీరంతా కలిసి దధీచి మహాముని దగ్గరకు వెళ్ళండి ఆయన నియమ నిష్ఠలతో చిరకాలం తపస్సు చేసిన తేజస్వి. బ్రహ్మజ్ఞాని, అతని అస్థికలన్నీ పరమపావనమైనవి. మీరాతని శరీరాన్ని కోరండి. అతని వెన్నెముకతో వజ్రాయుధాన్ని, మిగతా ఎముకలతో ఇతర ఆయుధాలను, విశ్వకర్మచేత తయారు చేయించుకోండి వాటితో మీరు వృత్రాసురుని చంపగలరు " అన్నాడు. "ప్రభూ! మీకు ఇష్టం లేకపోతే ఆ మాట స్పష్టంగా చెప్పండి. కాని దధీచి శరీరాన్ని కోరమంటారేమిటి ? ఇది సాధ్యమైన పనేనా ? జీవించియున్నవాడెవడైనా తన శరీరాన్ని దానం చేయడానికి ఒప్పుకుంటాడా ?

"దేవతలారా ! అందరు మీ వలె స్వార్థపరులుగా ఉండరు శిబిచక్రవర్తి కపోత సంరక్షణానికి తొడ మాంసం కోసి ఇవ్వలేదా ? బలిచక్రవర్తి ఇచ్చినమాట నిలుపుకోడానికి, తన సర్వస్వం నాకు ధారపోయలేదా ? దధీచి పరోపకార పరాయణుడు అశ్వనీదేవతలకోసం శిరస్సు తెగినా వెరవని ధీరుడు. మరొక రహస్యముంది వృత్రాసురుని తండ్రి త్వష్టమహామునికి ఇంద్రుడు శత్రువు. ఇంద్రుని చంపాలన్న సంకల్పంతోనే యజ్ఞం చేసాడు. అయితే దానిని నిర్వహించిన హోతలు చేసిన ఉచ్చారణ లోపంవల్ల ఆ సంకల్పం తలక్రిందులయింది. "ఇంద్రశత్రో" అన్నమంత్రంలో 'ఉ' కారంపై ఉదాత్తస్వరం పలకవలసియుండగా, పొరపాటున 'ఇ' కారంపై ఉదాత్తస్వరం పలకటంతో " ఇంద్రుని చంపువాడన్న " అర్థం రావలసిపోయి, "ఇంద్రునిచే హతుడయ్యేవాడు" పుట్టాలన్న సంకల్పం జరిగినట్లయింది. కనుక వృత్రాసురుడు ఇంద్రునిచేతిలో మరియకతప్పదు. ఇంద్రునికా నారాయణకవచము రక్షణగా ఉండనే ఉంది. అతనికి మరణభయముండదు.

" మేమడిగినా దధీచి శరీరదానం చేయకపోతే...' అన్నారు దేవతలు.

నారాయణుడు " మీరంతా సంశయాగ్రస్తులయిన. చిత్తాలు కలవారు మహర్షి తప్పక ఇస్తాడని నేను చెప్తుంటే నమ్మరేం ? అతని పవిత్రాస్థికలతో వజ్రాయుధం నిర్మాణం కాగానే నా వైష్ణవతేజంకూడ అందులో నిక్షిప్తం చేస్తాను. అంతేగాక, అతని ఎముకలను పొందుట ద్వారా, మీరు పోగొట్టుకున్న ఆయుధాలన్నీ తిరిగి పొందగల్గుతారు " అన్నాడు.

## దేవతలు ఆయుధాలను దధీచి వద్ద కుదవబెట్టుట

దీనికి పూర్వగాథ ఉంది. ఒకసారి జరిగిన దేవాసుర సంగ్రామంలో దేవతలకు విజయం చేకూరింది. అసురులు పరాజయం పొంది పారిపోయారు. జయం సాధించి పెట్టిన దివ్యాస్త్రాలను సురక్షితపరచుకోవాలన్న ఉద్దేశ్యంతో, సత్యవాదియైన దధీచి మహర్షిని ఆశ్రయించారు.

ఒక్కుమ్మడిగా వచ్చిన దేవతా సమూహం రాకకు సంతసించిన మహర్షి తాను వారికేమి ఉపకారం చేయవలసియున్నదని అడిగారు. "స్వామీ ! మీ ఆశ్రమంలో మా ఆయుధాలను భద్రంగా ఉంచండి. స్వర్గంలో ఉంచే ఇది అసురులు తస్కరించవచ్చు. మీ తపఃప్రభావం వలన వారిక్కడకు రాలేరు. అవసరమొచ్చినప్పుడు మేమే వచ్చి మరల తీసుకుంటాం " అన్నారు దేవతలు. మహర్షి అంగీకరించాడు.

( తరువాయి 48 వ పేజీలో )

వేసవి తరగతుల ప్రసంగం - 2

# కోకులు కాకులు!

# కాకుల అరుపులకు కోకిల తన గానమును మానుకుంటుందా?

భగవాన్ బాబా దివ్య సందేశం

ప్రేమస్వరూపులారా!

ప్రకాశించు జ్యోతిని చూడవలెనన్న మరొక జ్యోతిని మనం వెదకనక్కరలేదు. స్వప్రకాశమైనటువంటి ఆత్మ సర్వులయందు ప్రకాశించుచున్నప్పటికిని దీనిని ప్రకాశింపజేయుటకు మరొక జ్ఞానము వెతుకనక్కర లేదు. ఆత్మకు మార్పు లేదు బుద్ధికి స్వంతజ్ఞానమూ లేదు. బుద్ధి కేవలం ఒక బల్బువంటిది, విద్యుచ్ఛక్తియే ఈ బల్బును ప్రకాశింపచేయుచున్నది కనుక బుద్ధి కేవలం మేధాశక్తిని ఆధారం చేసుకొని దేహం యొక్క విజ్ఞతను చాటుతున్నదనగా ఇది బుద్ధి చాటునది కాదు, కేవలం ఆత్మయొక్క ప్రతిబింబమే బుద్ధిద్వారా చాటుతున్నది. కర్తృత్వ భోక్తృత్వములతో కూడినటువంటిదే మానసికము. కేవలము జాగ్రత్త స్వప్న సుషుప్తుల యందు మానసిక చర్యలు అధికంగా గోచరిస్తూ ఉంటాయి. కాని గాఢనిద్రయందు ఈ మనస్సు లయమై కేవలము మానసిక ప్రభావం ఏమాత్రం ప్రకాశింపజేయక స్తంభించిపోతుంది ఇక్కడ సూపర్ ఇంటలెక్ట్యువల్ కాన్షస్‌నెస్ అనే పేరుతో ప్రకాశిస్తున్నది. ఈ కాన్షస్‌నెస్ అనేది సర్వత్రా ఉండినప్పటికినీ, బుద్ధిని ప్రకటింజేసేటటువంటి యొక్క కాన్షస్‌నెస ఒక ప్రత్యేకమైన రూపంలో దర్శింపజేస్తున్నది అగ్ని కంటే అగ్నితో కూడినటువంటి ఇనుము తరింత వేడిని అందిస్తుంది. కనుకనే సర్వత్రా వుండినటువంటి విశ్వచైతన్యం కంటే కూడనూ ఇంటలెక్ట్యువల్ చైతన్యం చాలా ప్రభావముగా మానవత్వంపైన ప్రకటింపజేస్తుంది. ఈ సమయమునందు మనస్సు స్తంభించి

"రాగమే ఒక రోగము. వాంఛలే ఒక రోగము, ఈ యొక్క రాగమును నెరవేర్చుకొనే నిమిత్తమై అనేక విధములైన పెడమార్గములను పడుతున్నాం. కనుక మొట్టమొదట ఈ రాగమనే రోగమును నివారణ చేసుకోవాలి. ఏమిటి ఈ రాగం? వాంఛలే ఈ రాగము. దీనినే "ఆశ" అంటారు. దీనినే "తృష్ణ" అంటారు. ఆశలు రెండు విధములు. 1) పేరాశ, 2) దురాశ. మానవునికి అవసరమైనవి ఆశించటంలో ఏ మాత్రం దోషం లేదు. అవసరాల కోసమే కాక మితిమీరిన ఆశలు పెంచుకుంటే "దురాశ"గా మారుతుంది. ఆ దురాశనే "రాగము" అన్నారు. కనుక మానవునకు ఆశ ఉండవచ్చును గాని, ఈ ఆశలు చీమలపుట్టలవలె పెరుగకూడదు. ఈ ఆశల వలన దోచుకొనే రాగము, దాచుకొనే వ్యక్తిత్వం మనలో ప్రవేశింపకూడదు." - బాబా

పోతుంది ఈ మనస్సు స్తంభించిన తరువాతనే Super mind అనేటువంటిది ప్రారంభమవుతుంది. అనగా మనస్సుకు అతీతమైన స్థితిని మానవుడు అందుకున్నప్పుడు, నిద్రావస్థయందు ఏ విధమైన చలనములేక, దేహభ్రాంతులు లేక, ఏ విధంగా నిశ్చింతతో వుండునో ఆ విధంగా Super mind అనేటువంటిది నిశ్చింతగా ఉంటుంది కదిలేది నీటియొక్క స్వభావమే అయినప్పటికీ, అందులో కనిపించే చంద్రుడు కదులుతున్నట్లుగా మనం భావిస్తున్నాము చంద్రునియొక్క ప్రతిబింబం స్థిరముగానే ఉన్నది కాని ఆ ప్రతిబింబమును కనిపింపజేయునట్టి జలమే చలనముగా కదులుతున్నది. కనుక Super mind అనేటువంటిది స్పష్టమై నిత్యమై, స్థిరమై ఉండినప్పటికినీ, ఈ యొక్క మానసిక తత్త్వమనేటటువంటి జలముయొక్క ప్రభావంచేత అది కూడా కదులుతున్నట్లుగా కనిపిస్తున్నది.

మనస్సును ప్రధానముగా విశ్వసించి, దానిని ఆధారము చేసుకున్నటువంటి మానవత్వం కేవలం మానవునిగానే జీవిస్తూ వస్తాడు. ఆత్మను ఆధారముగా చేసుకున్నటువంటి వ్యక్తిత్వం కేవలం ఆత్మతత్త్వముతోనే జీవిస్తుంది మనోయింద్రియములయొక్క కూడికచేతనే బంధింపబడుతున్నాడు మానవుడు. మనము ఈనాడు బోధించునది మానవులకు అని భ్రమిస్తున్నాం, మానవులకు కాదు బోధించేది మనస్సుకు బోధించాలి పరతత్త్వాన్ని పరులకు బోధించలేననిన, లేక తనకు తాను గ్రహించవలెననిన మొట్టమొదట నిశ్చలచిత్తుడుగా నీవు నిర్మాణం కావాలి. ఈ నిశ్చల తత్త్వము చేరినప్పుడే, ఇది కేవలం ఒక Over mind స్థాయికి అందుకుంటుంది ఇందులో ప్రాకృతమైన భావములుకాని లౌకికమైన భావములుకాని, జగత్సంబంధమైన భావములుకాని ఇందులో ఏమాత్రం ప్రవేశించుటకు వీలుండదు. గది అంధకారముగాను, మాలిన్యంగాను ఉండినప్పుడే ఈ గది లోపల విషపురుగులైన పాములు, తేళ్ళు ప్రవేశిస్తూ ఉంటాయి గృహము పరిశుద్ధముగను ప్రకాశవంతముగను వుండినప్పుడు, ఇందులో విషపురుగులు ఏమాత్రం ప్రవేశించవు కనుక ఈ మనస్సు అనే గదియందు పవిత్రమైన భావములు ప్రవేశించినప్పుడు, ఇది ప్రకాశవంతమైన నిర్మలమైన జ్ఞానస్వరూపంగా రూపొందుతుంది ఇది దివ్యమైన మనస్సుయొక్క ప్రభావముయొక్క పరతత్త్వము మానవత్వమనేటటువంటిది మనస్సుతో కూడిలేదనే విషయం మనం గుర్తించాం. ఎంతవరకు ఇతడు మానవుడు ? మనస్సు వుండినంతవరకు ఇతడు మానవుడే ఈ మనస్సు అనేటటువంటి ఉపాధిని ధరించినంతకాలమూ, ఇతను మానవుడుగానే జీవిస్తుంటాడు ఈ మనస్సు పరిమితముతో కూడినటువంటిది ఈ పరిమితమునకు అతీతమైనటువంటి స్థితిని మనం పొందినప్పుడే అపరిమితమైన విశాలత్వాన్ని మనం చూడగలుగుతాం.

దీనికి ఒక చిన్న ఉదాహరణ. మనం ఒక సుందరమైన భవనమును నిర్మించుకున్నాం ఈ భవనం యొక్క ఏరియా అంతయూ ఒక గ్రౌండ్‌గా ఉంటున్నది. అప్పుడు గ్రౌండు యొక్క విశాలత అధికంగానే ఉంటుంది కాని ఈ గృహమునందు ఒకటి పడకగది, ఒకటి వంట గది, ఒకటి స్నానాల గది, ఒకటి భోజనశాల, ఒకటి డ్రాయింగ్‌రూం—అనేక గదులుగా నిర్మించుకున్నాం ఈ గదులు నిర్మించుకోవటంచేత ఈ గదులు చాలా చిన్నవిగా కనిపిస్తుంటాయి అయితే ఈ చిన్న గదులకు ఏది మూలకారణం ? ఒక గదికి మరొక గదికీ మధ్య గోడలు నిర్మించుకోవటంవలననే గదులు చిన్నవిగా కనిపిస్తున్నాయి. ఈ నిర్మించిన గోడలను మనం తీసివేసినప్పుడు, అంతా విశాలమైన హాలుగా కనిపిస్తుంది అదియే ఉపాధియొక్క భేదములు. ఒక్కొక్క ఉపాధి అనే ఒక్కొక్క గోడను నిర్మించుకుంటున్నాం. నాది ఒక దేహము, నీది ఒక దేహము, అతనిది ఒక దేహము, ఇతనిది ఒక దేహము అని దేహనిర్మాణములు చేసుకోవటం చేతనే, ఎవరికివారు సంకుచితమైన భావాలను అనుభవిస్తూవస్తున్నాం, ఈ రూప నామములు మనం త్యజించినప్పుడు అంతా ఒక్కటిగానే

ఏర్పడిపోతుంది ఇదియే Universal Consciousness అన్నారు. ఈ 'యూనివర్సల్ కాన్షస్‌నెస్' అనేదికేవలం సర్వత్రా ఉండినటువంటిదే. మనం సంకుచితమయిన జీవితాన్ని అనుభవించే నిమిత్తమై, స్వార్థస్వప్రయోజనముల నిమిత్తమై, మనం కొన్ని పరిమితులను నిర్మించుకుంటున్నాం. ఒకదానికొకటి అంగ అంగీభావముల చేతనే ఇది నిర్మాణం అయిపోతున్నది. ఇది చెయ్యి, ఇది చెవ్వు, ఇది కన్ను, ఇది ముక్కు, ఇది నోరు — ఈ అంగములన్నీ కూడనూ దేహమునకు ఒక అంశము లుగా ఉంటున్నాయి. దేహములో ఇవన్నీ అంగములే. అంగములు దేహమునకు ఏవిధమైన భాగములుగా ఉంటున్నాయో, ఈ దేహములు సమాజమునకు ఆ విధంగా అంగములుగా ఏర్పడుతూవచ్చాయి. ఈ సమాజమునకు దేహములు అంగములు అయినట్లే, సమాజం మానవత్వానికి అంగముగా ఏర్పడుతూ వచ్చింది. ఈ మానవత్వము అనేటటువంటిది ప్రకృతికి అంగములుగా ఏర్పడుతూవచ్చింది. ఈ ప్రకృతి పరమాత్మకు అంగముగా మారిపోయింది. పరమాత్మే ప్రకృతి. ప్రకృతికి అంగం మానవత్వం. మానవత్వమునకు అంగము సమాజము. సమాజమునకు అంగము దేహము. దేహముయొక్క అంగములు చేతులు, కాళ్ళు, ముక్కు, నోరు, కన్నులు వగైరాలు. జగత్తులో మనం ఎక్కడ చూచినా అంగఅంగీభావములే మనకు ప్రత్యక్షమవుతున్నాయి. కనుక మనం అంగ అంగీభావములను మనం దూరం చేసుకున్నప్పుడు సర్వమూ ఒకటిగానే మారిపోతుంది. ఈ ఏకత్వ దర్శనమునందునే మానవునికి ఆనందం ప్రాప్తిస్తుంది. మానవత్వమునందు ఒక విధమైనటువంటి అల్పత్వమనే దానిని మనం విశ్వసిస్తున్నాం. ఇది అనేక జన్మలయొక్క సంస్కారమును పురస్కరించుకొనియే ఈ అల్పత్వానికి పూనుకొంటున్నాడు. ఎంత విశాలమైనటువంటిది, ఎంత అనంతమైనటువంటిదిగా వుండినప్పటికినీ — యీ అనంతతత్త్వాన్ని మనం ఏమాత్రం గుర్తించటానికి ప్రయత్నించటం లేదు. చిన్న ఉదాహరణ. మనం భుజిస్తున్నాం. ఈ భుజించటంలో మనం కొన్నివేల మెతుకులు మ్రింగివేస్తున్నాం. కాని ఇవి ఒకటి రెండూ మూడు అని లెక్కించటంలేదు. కాని ఒకటి రెండు చిన్నరాళ్ళు మన పంటి క్రిందపడితే అన్నంలో అంతా రాళ్ళున్నాయని, యీ అల్పత్వంచేత అధికత్వాన్నికూడా కించపరుస్తున్నాం. కనుక మనం యీ అల్పత్వానికి మనం అలవాటుపడిపోయినాం. ఈ సహజత్వాన్ని చక్కగా గుర్తించటానికి ప్రయత్నించటంలేదు. ఈ సహజత్వాన్ని మనం విస్మరించి, అసహజత్వాన్ని విశ్వసించి, దివ్యత్వాన్ని మనం కోల్పోతున్నాం. ఇలాంటి దివ్యత్వమనే దానికి, మానవత్వానికి మధ్య ఏమాత్రం అడ్డుగోడలులేవు. మన భ్రమ మాత్రమే దీనికి అడ్డుగా నిలుస్తున్నది.

నేను చూసాను! నేను చూసాను! నేను అనుభవించాను! అనేటటువంటిది ఒకవిధమైన కర్తృత్వ భోక్తృత్వమునకు ఒక అవకాశము అందిస్తున్నది. నేను చేసింది ఏమీలేదు. నీవు చూచింది ఏమీలేదు. నీవు అనుభవించింది ఏమీలేదు. ఇవన్నీ కూడను ఒక అంతర్భావంతో వుండిన ఆత్మశక్తియే చేయిస్తుంటుంది.

" ఇది చేతు అది చేతు ఇంకెన్నియో చేతు
ననుచు ఊహాలు అల్లి అలసిపోకు
ఏ విత్తులను నాటి యిచ్చోట నుంటిరో
ఆ ఫలమ్ములె మీకు అందుచుండు "

విత్తనములు ఒకటై ఫలములు వేరుగా మనకు లభ్యం కావు. కనుక మనం చేసినటువంటి కర్మలన్నియు కూడనూ మన భ్రాంతిచే నేను చేశానవి భావించటంచేతనే తాను అనుభవించదానికి తగిన అర్హతను కోల్పోతున్నాడు. ఈ అనుభవించేదంతా సూక్ష్మదేహమే. ఇదియే ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశముల యొక్క స్వరూపము. దీనినే వేదము (ఋతుం) సత్యం బృహత్వం (విశాలత్వం) అన్నది. దీనినే ఉపనిషత్తులయందు కూడనూ మహాతత్వము

అన్నారు. దీనినే ధూమము అన్నారు బ్రహ్మ తత్త్వమే ధూమము వ్యాప్తింపచేసేటటువంటి గుణము కలిగినదే బ్రహ్మ. ఎప్పుడూ వ్యాపించిపోతుంది వ్యాపించే గుణం గాలితో కూడినటువంటిది గాలి సర్వత్రా వ్యాపించి ఉంటుంది. ఇది పంచభూతములలో ఒకటి. కనుక ఈ ఐదు ఇంద్రియములు కూడనూ మానవునికి హస్తగతమైనవే. ఈ పంచభూతములను స్వాధీనం నందుంచుకొని ఎంతో అభివృద్ధిగాంచవలసిన మానవుడు, ఆ విధంగా కాలేకపోతున్నాడు. ఈ ఐదు ఇంద్రియములకు దాసుడు కావటం చేతనే, సర్వమునకు బద్ధుడైపోతున్నాడు. కనుక మనం బద్ధులం కాదు, బుద్ధులమే. కనుక ఇలాంటి బుద్ధి ఉండినప్పటికినీ మనం మానవత్వాన్ని విభజించుకొనిపోతున్నాం. ఈ మానవత్వం చాలా విశిష్టమైనది, ఉత్కృష్టమైనది, సౌజన్యమైనది, సౌశీల్యమైనది. కనుక ఇలాంటి మానవత్వాన్ని మొట్టమొదట మనం అర్థం చేసుకోవాలి మానవుని కంటే అధికమైనదిఈ జగత్తున మరొకటి కానరాదు. అట్టి దివ్యత్వమైన మానవత్వాన్ని మనం ధరించి, అల్పత్వమయిన దేహభ్రాంతిని వరించి మనం ఆత్మతత్త్వమును విస్మరిస్తున్నాం. ఇది సరియైనటువంటిది కాదు ఎన్ని విద్యలు మనం చదువుతున్నాం, ఎన్ని యంత్రములు కనిపెడుతున్నాం — ఇవన్నీ కేవలం ప్రాకృతమయినటువంటివిగాను, యాంత్రికమయినటువంటిగాను గోచరిస్తున్నాయి ఇది యాంత్రికమయిన జీవితముగానే నడుస్తున్నాది. ఇలాంటి Artificial life (కృత్రిమమయిన జీవితం) లోపల Heart (హృదయం) లేకుండా మనం జీవిస్తున్నాం. కనుక మన హృదయమనేటటువంటిది భగవంతుని స్థానం. ఈ హృదయస్థానమందు దివ్యత్వమే ఉండాలి గాని మానవత్వంగాని, పశుత్వంగాని మరొక అల్పత్వంగాని ప్రవేశించుటకు వీలులేదు దేహమునందలి సర్వేంద్రియములు కూడా దివ్యత్వం ప్రకాశం నిమిత్తమే ఏర్పడినాయిగాని అన్యమార్గముల నిమిత్తమై ఏర్పడినటువంటివి కావు.

మనం ఇల్లు కట్టాం, కిటికీలు పెట్టాం, ద్వారములు నిర్మించుకున్నాం. ఈ ద్వారములు ఎందుకోసం నిర్మించుకున్నాం. మనం వచ్చి పోయే నిమిత్తం, మన బంధువుల రాకపోకల నిమిత్తం. ఎవరికి అర్హత ఉంటుందో వారికే అవకాశం యిస్తాం. ద్వారము ఉన్నదిగదా యని దారినపోయే గాడిదలు, పందులను ప్రవేశపెట్టం. అదే విధముగ మనకు ఇంద్రియములనే ద్వారములు ఉంటున్నాయి. వీటి ద్వారా పవిత్రమయిన, ఉత్కృష్టమైన సౌశీల్యమైన భావములను మాత్రమే లోపల ప్రవేశపెట్టాలి. ఇందు నిమిత్తమే ఈ దేహమునకు ఇంద్రియములు ఏర్పడినాయి. కాని ఈ సత్యమును గుర్తించుకోలేని మానవుడు దుర్గుణములు, దురాలోచనలను లోపల ప్రవేశపెడుతున్నాడు. తద్వారా మన హృదయం మాలిన్యమైపోతున్నది. ఈ హృదయ మాలిన్యమునందు భగవంతుడు ఉండలేడు. ఈనాడు ప్రపంచమంతా మాలిన్యంగానే కనిపిస్తున్నది శబ్ద, స్పర్శరూప, రస, గంధారులు — ఈ ఐదు కూడనూ అంతా మలినమయిపోయినాయి మంచి గాలి మనకు లభ్యం కావటంలేదు. మంచి నీరు మనకు ప్రాప్తించటంలేదు. మంచి వెలుతురు లేదు. ఇంక మానవత్వం ఏ రీతిగా విశ్వశాంతిని చేకూర్చే విధానాన్ని గుర్తించుతుంది? పంచభూతములను మనం మాలిన్యపరచుకుంటున్నాం. కనుకనే మనస్సు దీనికి అతీతమయిన స్థితిని పొందాలని ఆధ్యాత్మికత ప్రబోధిస్తున్నది. కనుక మనం అంతర్‌దృష్టిని అభివృద్ధిని పరచుకోవాలి. ఇదే Realisation of innerconsciousness. ఏది చేసినప్పటికినీ బహిర్ ముఖములో కాదు, అంతర్ ముఖములో వివరించాలి. అదే Realisation of Cosmic energy అన్నారు. ఈ కాస్మిక్ ఎనర్జీ అనేటటువంటిది ఎక్కడ ఉంటున్నది? సర్వత్రా ఉంటున్నది. ఇది In you, with you. Above you, arround you. నీవే ఒక కాస్మిక్ ఎనర్జీ. ఈ సత్యాన్ని నీవు గుర్తించుకోలేకపోతున్నావు.

( తరువాయి ౧జీలో )

# నారద భక్తిసూత్రాలు-33

# భక్తి దర్శనాచార్యులు

-"శాంతిశ్రీ" జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి

83 సూ. ఇత్యేవం వదంతి జనజల్ప
నిర్భయా
ఏకమతా కుమార వ్యాస శుక
శాండిల్య
గర్గ విష్ణు కౌండిన్య
శేషోద్ధవారుణి
బలి హనుమ ద్విభీషణా
దయో భక్త్యాచార్యాః

సనత్కుమారుడు, వేదవ్యాసుడు శుకదేవుడు శాండిల్యుడు గర్గఋషి విష్ణుముని కౌండిన్యుడు, ఆదిశేషుడు ఉద్ధవుడు ఆరుణి ( నింబార్కుడు ) బలి హనుమంతుడు విభీషణుడు మొదలైనవారు భక్తి తత్త్వ శాస్త్రాచార్యులు. మహాత్ములందరు జనుల నిందాస్తుతును లెక్కపెట్టకుండ ముక్తకంఠంతో భక్తి మార్గమే అన్ని యోగాలకంటే సర్వశ్రేష్ఠం అని నొక్కి వక్కాణించారు

ఈ చివరి సూత్రంలో నారద మహర్షి తన సూత్ర వాద పరిపుష్టికిగాను ఇతర భక్తి శాస్త్రాచార్యుల అభిమతాన్ని ప్రమాణంగా పేర్కొంటున్నాడు.

## సనత్కుమారులు

వీరు బ్రహ్మమానస పుత్రులు. వీరు మహాజ్ఞానులు. వీరు ఎల్లకాలాలలోనూ కౌమార వయస్సులోనే ఉంటారు. బ్రహ్మజ్ఞాన సంపన్నులైన వీరు బాలకులవలె దిగంబరులై విహరిస్తుంటారు. విష్ణుదేవునకు వీరు అత్యంత ప్రీతి పాత్రులు.

ఒకసారి వీరు శ్రీమహావిష్ణువుని సేవించటానికై వైకుంఠం వెళ్ళారు. అక్కడ విష్ణుమందిరానికి జయ విజయులు ద్వారం వద్ద కాపలా కాస్తున్నారు. వారు మహాయోగిపుంగవులైన సనత్కుమారులను చూచారు. దిగంబరులై బాలురవలె పిచ్చివారుగా ఉన్నందువలన ఈ మునుల మహాత్మ్యము తెలుసుకోలేక పోయారు జయ విజయులు కూడా మహా భక్తులే అయినా మాయలో పడ్డారు. వారికి గర్వం తలకెక్కింది మాన్యులను సామాన్యులనుకొని వారు ద్వారం వద్ద అడ్డగించారు. విష్ణుమూర్తి దగ్గరకు ప్రవేశం ఈయలేదు సరికదా ఇంకా పైగా పరిహాసం చేశారు దుర్భాషలాడారు. మహాత్ముల మనస్సు చివుక్కుమంది ఎన్నడూ ఆగ్రహం ఎరుగనివారికి దురాగ్రహం వచ్చింది వెంటనే ఆ మహాత్ములు ద్వారపాలకుల గర్వం అణచటంకోసం శపించారు

" మీరు పదవీచ్యుతి పొంది రాక్షసులై జన్మింతురు గాక ! " అప్పటికి జయవిజయుల గర్వం దిగింది వారు విలవిలలాడారు వారికి శాప ప్రభావం తెలిసింది శ్రీమహావిష్ణువుని మహామందిర ద్వారపాలకులైన జయ విజయులు మునీశ్వరుల కాళ్ళపైన పడ్డారు సంయమీంద్రుల మాటలు కటువు కానీ మానసములు నవ్య నవనీత సమానములు మునులు వీరి దుఃఖాన్ని చూడ లేక శాపానికి కొంత ఉపశమనం కల్పించాలని ప్రశ్నించారు " మీరు మూడు జన్మలలోనే క్రూర కర్మలు చేసి విష్ణు విరోధులై విముక్తి పొందుతారా ! లేక

## మీకు తెలుసా?

### జాతీయ చిహ్నాలు

ఈ జాతీయ చిహ్నం అన్నది ఆ దేశం యొక్క ప్రతిష్టకు, కీర్తికి ఆ దేశానికి లభించే తిరస్కార పురస్కారాలకు బాధ్యులవుతూ ఉంటుంది. కొన్ని దేశాల National Emblems (జాతీయ చిహ్నాల) ని పరిశీలిద్దాం,

ఇండియా - లయన్స్ కేపిటల్
ఆస్ట్రేలియా - కంగారు
కెనడా - తెల్ల లిల్లీ పువ్వు
డెన్మార్కు - సముద్ర తీరం
ఫ్రాన్సు - లిల్లీ
జర్మనీ - జొన్న పువ్వు
ఇరాన్ - గులాబీ
ఇటలీ - తెల్ల లిల్లీపువ్వు
జపాన్ - చేమంతి పువ్వు
స్పెయిన్ - ఈగల్
బ్రిటన్ - గులాబీ
అమెరికా - గోల్డ్ రాడ్
పాకిస్తాన్ - చంద్రవంక

ఇలా ప్రతి దేశానికి ...

మాన్యులై అనేక జన్మలెత్తి విష్ణు సాయుజ్యం పొందుతారా !"

అందుకు వారు "మూడు జన్మలలోనే ముక్తి అనుగ్రహించండి" అన్నారు. దయామయులు అనుగ్రహించారు.

ఆ జయవిజయులే మొదట హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగాను రెండవ జన్మలో రావణ కుంభకర్ణులుగాను మూడవ జన్మలో శిశుపాల దంతవక్త్రులుగా ఘోర రాక్షస జన్మలెత్తి విరోధులై జగత్కంటకులై జనార్దనుని చేతిలో మరణించి విష్ణులోకం పొందారు. సనత్కుమారుల మహిమ అట్టిది.

"హరిః శరణమ్" అనేది సనత్కుమారులకు నిత్య పారాయణ మంత్రం. ఈ మహాతపస్సంపన్నులు "తన్మయాశక్తి స్మరణాసక్తి" గల భక్త శ్రేణిలో అగ్రగణ్యులు. వీరు నారదమహర్షికి "పరమార్థం" ఉపదేశం చేశారు వీరు వైష్ణవ భక్తవర్యులలో సర్వశ్రేష్ఠులు. "సనత్సుజాతము" సనత్కుమారుల వేదాంత బోధ వీరు దీనిని బోధించారు. వీరి పేర 'సనత్కుమార సంహిత' అను సంహిత ఉంది. అందులో శ్రీచక్ర విద్యను గూర్చి కూడా అనేక విషయాలు వివరించబడ్డాయి. ఉత్తములకు బాహ్య పూజ కర్తవ్యం కాదు- బ్రహ్మవాదులు అంతర పూజారతులు తంత్రివాదులు దా[illegible]్యజాతులు బాహ్యపూజారతులు బాహ్యపూజ ఐహిక ఫలదాయి అని వివరణ ఉంది

వీరుభక్త్యాచార్యులలో సర్వప్రథములుగా పరిగణింపబడిన పూజనీయులు వీరు నారద మహర్షికి గురువులు. కనుకనే ప్రథమ తాంబూలం వారికిచ్చారు నారద మహర్షి

* * *

నిరహంకారము నిర్మమత్వమును తండ్రీ !
నిత్యానైమిత్తి కా
చరణస్ఫూర్తియు శాంతి దాంతియు
యదృచ్ఛాలాభ సంతుష్టి నీ

చరణ ధ్యాన సమాధులన్న వెకదా !
సత్యం శివం సుందరం
పరమ మైన భగవత్ పదంబునకు
సోపానంబు లాత్మేరా !

## వేదవ్యాసుడు

వేదవ్యాసుని తండ్రి పరాశరుడు. తల్లి సత్యవతి. ఈయన కృష్ణ ద్వీపంలో జన్మించాడు. ఈయన మహా తపోనిధి అపార విజ్ఞానఖని, వేదవేదాంత మర్మజ్ఞుడు ఈ మహర్షి పురాణ ఇతిహాస సకల శాస్త్రాదులు తెలిసిన వాడు. నారదమహర్షికి శిష్యుడు.

ఏకరాశిగా ఉన్న వేద వాఙ్మయాన్ని "ఋగ్వేదం" "యజుర్వేదం" "సామవేదం" "అథర్వణవేదం" గా నాల్గు విభాగాలుగా చేశాడు. కనుక వేదవ్యాసుడనే పేరు ఈ మహానుభావునికి వచ్చింది. ఈయన అష్టాదశ పురాణాలు వెలయించాడు పంచమ వేదంగా "జయ" అనే పేరుతో మహాభారతం రచించాడు. అందు అంతర్భాగంగా " భగవద్గీత " బోధించాడు.

ఆ మహాభారతం ధర్మశాస్త్రంగాను, నీతి శాస్త్రంగాను, పురాణంగాను, మహాకావ్యంగాను పండిత ప్రశంసలు పొందింది అందులో ఈయన చెప్పని ధర్మం లేదు. పరిష్కారం చేయని సమస్య లేదు ఈయన భరత వంశీయులకు మూలపురుషుడు. ధర్మజాదులు స్మరించిన మాత్రాన వచ్చి అనేక సందేహాలు తీర్చి వారికి అభ్యుదయ మార్గాన్ని ఉపదేశించేవాడు.

అయినా ఈయనకు మనశ్శాంతి కలుగలేదు. కారణం ఆలోచనకు అందలేదు అపుడు అయన నారదమహర్షిని అడిగాడు నారదమహర్షి ఆలోచించి " నీవు ఇన్ని రచించావు. కానీ విష్ణు భక్తిని గూర్చి మహత్తర గ్రంథం ఒక్కటీ వ్రాయలేదు. ఇతర గ్రంథాలు ఎన్ని



వ్రాసినా అవి కాకతీర్థాలవంటివే కాని పరమహంసల ప్రశంసకు పాత్రమైనవి కావు భాగవతం రచించు. నీకు మనశ్శాంతి కల్గుతుంది అని హితోపదేశం చేశాడు. అప్పుడు వ్యాసుడు విష్ణుభక్తి ప్రాశస్త్యం వివరించే మహాభాగవతం వ్రాసి చరితార్థుడై కృష్ణప్రీతి పొందాడు

ఈయన గుణ మహాత్మ్యాసక్తిరీతిలో అగ్రేసరుడు. ఈయన శుకమహర్షికి సాక్షాత్తు జనకుడు. ఈయన నాల్గు ముఖాలు కాక ఏక ముఖం గల బ్రహ్మదేవుని అంతటివాడు నాల్గు చేతులు కాక రెండు చేతులు మాత్రమే గల శ్రీమహావిష్ణువే నొసట కన్నులేని మహాదేవుడు ఈ వేదవ్యాస మునీశ్వరుడు. విద్వన్నుతిఖ్యుడు, వేదమూర్తి, త్రిజగద్విఖ్యాత తేజోవిరాజితుడు. వివిధ కవిశ్రేష్ఠులచే సంస్తవనీయుడు భవ్య కవితావేశం గల విజ్ఞాన సంపదగల మహామహుడు. మహామునీశ్వరులచే ప్రశంసింపబడిన ఉత్తమోత్తముడు ఈయన భారతీయ సంస్కృతికి మూలపురుషుడు.

# గీత అమృతవర్షిణి

సాయి గంగామహాదేవ్

శ్లో॥ అసంశయం మహాబాహో ।
మనో దుర్నిగ్రహమ్ చలమ్ ।
అభ్యాసేనతు కౌన్తేయ
వైరాగ్యేణ చ గృహ్యతే॥

— మనస్సునకు ఇవతల నున్నది జీవత్వము, మనస్సునకావలనున్నదే దైవత్వము కావున జీవత్వము నుండి దైవత్వమునకు చేరవలెనన్న మధ్య నున్న మనస్సును జయింపవలసివున్నది సాధన అనగా మనస్సుతో సలుపు పోరాటమే అందువలననే భగవాను డిచ్చట మనస్సుయొక్క స్వభావమును,దానిని జయించుటకు కావలసిన సాధనలను తెలుపుచున్నారు.

మనస్సు 1) దుర్నిగ్రహము 2) చలము దుర్నిగ్రహమనగా అత్యంత కష్టముగా నిగ్రహింపబడునది. చలము అనగా నిరంతరము చలించునది అని అర్థము. మొదట మనస్సును నిగ్రహించాలి మనస్సును నిగ్రహించగలిగినవాడే దాని చపలత్వాలను అరికట్టగలడు. మనస్సును నిగ్రహించుటకు "అభ్యాసము" అవసరము. దాని చపలత్వాలను అరికట్టుటకు "వైరాగ్యము" అవసరము. అభ్యాసము – అనగా తనమీద యజమానిగా ప్రవర్తించు మనస్సున కెదురు తిరిగి, దాని ఆజ్ఞలను తాను పాటింపక, తానిచ్చే ఆజ్ఞలనే మనస్సుచేత పాటింపచేయాలని చేసే తీవ్రప్రయత్నము. అనగా మనస్సుయొక్క ఆధిపత్యమును ధిక్కరించి, తానే దానికి అధిపతిగా వర్తించుటకు చేయు ప్రయత్నము. ఇదే అభ్యాసము. అంతేకాని, ఏదో ఒక అర్థము తెలియని సాధనను చేబూని మాటిమాటికి దానినే ఆచరించుట అభ్యాసము కాదు. మనస్సు తనకు యజమాని కాదని, తానే దానికి యజమానిగా ప్రవర్తించాలి దీనివలన మనస్సు తన వశమౌతుంధి. ఇది ఇంద్రియ నిగ్రహమువలననే సాధ్యము. ఇంద్రియ నిగ్రహత్వము వలన మనోనిగ్రహత్వము లభిస్తుంది.

ఈ విధమైన అభ్యాసము ద్వారా ( ఇంద్రియ నిగ్రహత్వము ద్వారా ) మనస్సు నిగ్రహింపబడుతుంది ఇంద్రియాలు తనకు సహకరించనందువలన మనస్సు క్రియాత్మకం అవలేదు అంతేకాని దాని చపలత్వాలను మాత్రము వీడలేదు. అందువలన ఈ మనస్సు సంకల్ప, వికల్పాల రూపంలో నిగ్రహింపబడిన స్థితిలో కూడా చలిస్తూనే వుంటుంది

తానిచ్ఛగించే విషయాలను ఇంద్రియాదుల ద్వారా పొందలేకున్ననూ, చింతనద్వారా పొందుతుంది. ఈ చింతనాత్మకమైన చపలత్వాలను జయించడానికి కేవలము వైరాగ్యమే ఆధారము. వైరాగ్యరహితులు మనోచపలత్వాలను అరికట్టలేరు మనస్సు చపలం కావడానికి వాసనలే ఏకైక కారణము వాసనలున్నంతవరకూ చపలత్వాలుంటాయి కనుక విచారణ ద్వారా విషయ సుఖాలయొక్క దుఃఖతత్త్వాన్ని దర్శించాలి అందువలన వాసనలు తొలగిపోతాయి అదే వైరాగ్యము. ఈ వైరాగ్యము వలన వాసనలు నిర్మూలన మౌతాయి. ఎప్పుడు వాసనలు రహితమైనవో అప్పుడు మనస్సు చింతనలను వీడి చిత్‌లో ఐక్యమైపోతుంది. అదే తురీయము.

కనుక మనోలయానికి ముందు ఇంద్రియనిగ్రహమను అభ్యాసము, వాసనారాహిత్యమను వైరాగ్యము అత్యవసరము. దీనిని పొందక ఎవరెవరెన్నెన్ని విధముల సాధనలు సలిపినప్పటికినీ అవి సఫలం కావు, కానేరవు ఈ విషయాన్ని అందరూ హృదయపూర్వకంగా గుర్తించాలి. అందుకే భగవానుడు అర్జునున్ని రెండు రకాలుగా సంబోధించాడు మహాభాగో: –అనగా గొప్ప ప్రయత్నములు (అభ్యాసము) చేయగల శక్తి గలవాడా – అని అర్థము. కౌన్తేయ :– కుంతీమాతలాగా కష్టసుఖాలను సహిస్తూ, దైవాన్ని ప్రేమిస్తూ వైరాగ్యం పొందగలవాడా! అని అర్థము. అందువలన అందరూ దైవకృపచే మనోరహితులై మాధవులై వర్థిల్లెదరుగాక !

# ఓటమి నెరుగని ధీరులు

– జానమద్ది హనుమచ్ఛాస్త్రి

ఒక్క వ్యక్తి ఏమి చేయగలడు ? అని నిరూపించ డానికి రెండో ప్రపంచయుద్ధ కాలంలో అమెరికాలో జరిగిన ఒక సంఘటన మంచి ఉదాహరణ

యుద్ధం యూరప్‌లో, ఆఫ్రికాలో ఆగ్నేయ ఆసియాలో జరిగిన దాని ప్రభావం ప్రపంచ వ్యాప్తంగా వుండేది. అమెరికా సైనిక దళాలు యూరప్ యుద్ధ రంగంలో వుండేవి. ఆ సైనికుల భార్యలు యుద్ధంలో ఉపయోగపడు సరుకుల ఉత్పత్తిచేయు కార్ఖానాల్లో పని చేసేవారు. వారి పిల్లలను చూచుకునేందుకు ఇంట్లో ఎవరూ లేరు. ఆ పిల్లలు మధ్యాహ్న భోజనానికై అలమటిస్తుండేవారు

ఆ పిల్లల దయనీయ స్థితిని గురించి ఒక అమెరికన్ మహిళ వాయ్స్ ఆఫ్ అమెరికాలో శ్రోతల హృదయాలు కరిగేలా చిత్రిస్తూ ప్రసంగించింది "హిట్లర్ దురాగతాల నుండి ప్రపంచాన్ని కాపాడేందుకు, ఈ పిల్లల తండ్రులు పోరాటం సాగిస్తున్నారు. పోరాడుతున్న భర్తలకు కావలసిన యుద్ధోపకరణముల ఉత్పాదనలో తల్లులు కర్మాగారాల్లో పనిచేస్తున్నారు. కాని వారి పిల్లలను చూచుకునేవారెవరు ? ప్రపంచం సుఖంగా వుండాలన్నది వాస్తవమైన కోరికే. అందుకోసం ఆ పిల్లలు ఆకలితో, కదలిపోవాలా ? వారి పరిస్థితులను గమనించి ఆదరించే హృదయాలు అమెరికాలో లేవా ? "

గుండెలను పిండే ఆమె పలుకులు విన్న ఒక వ్యక్తి హృదయం నీరైంది. వెంటనే రేడియో కేంద్రానికి ఫోన్‌చేసి ప్రసంగకర్తతో మాట్లాడాడు " మేడమ్, మీరు నాకో సాయం చేయాలి. మీ ప్రసంగ పాఠాన్ని టేప్ చేయించి దయచేసి నాకు పంపండి. కొన్ని వందల టేప్‌లు కావాలి " అన్నాడు

అప్పట్లో జరిగిన విషయం గమనించాలి. అమెరికా సెనెట్‌లో ఒక సభ్యుడు పిల్లలకు మధ్యాహ్న భోజనం ప్రభుత్వమే సమకూర్చాలని ప్రతిపాదించాడు. ఒకే ఒక వోటుతో ఆ ప్రతిపాదన వీగిపోయింది. పై పేర్కొన్న దయామయుడు, ఉచిత భోజన ప్రతిపాదనను వ్యతిరేకించిన సెనెటర్ చిరునామా సేకరించాడు. ఆ పట్టణంలోని, రేడియో కేంద్రాధికారులతో సంప్రదించాడు. తన వద్ద నున్న ప్రసంగం టేపును ఆ కేంద్రం నుండి ప్రసారం చేయమని కోరాడు. అందుకయ్యే ఖర్చులన్నింటినీ చెల్లించాడు. ఆ టేప్‌ను, సరిగా ఆ సెనెట్‌లో రాత్రి భోజనం చేసే వేళలో ప్రసారం చేయమని కోరాడు.

సెనెట్‌లో భోజనం చేస్తున్నపుడు ప్రసంగం విన్నాడు. తాను పెద్ద నేరం చేసినట్లు భావించాడు.

కొంత కాలంతర్వాత సెనెట్‌లో ఉచిత మధ్యాహ్న భోజన ప్రతిపాదన మరోసారి చర్చకు వచ్చింది. సెనెట్ ఆ ప్రతిపాదనను ఏకగ్రీవంగా అనుమతించింది. ఒక వ్యక్తి శ్రద్ధాసక్తులతో ఒక మంచి పనిని ప్రారంభిస్తే తప్పక ఫలిస్తుంది. పిల్లల దయనీయ స్థితిని విన్న ఆ వ్యక్తి తనవల్ల ఏమవుతుంది అని నిరాశతో చేతులు ముడుచుకొని కూర్చుని వుండిన, తల్లిదండ్రుల రక్షణకు నోచుకోని ఆ పిల్లలు మధ్యాహ్న భోజనానికి నోచుకోక పరితపించేవారు కదా ?

వ్యక్తులూ – వ్యక్తిత్వాలు : 50

# ప్రభుత్వం యిచ్చే ఐదు ఎకరాలకన్న ప్రజలు కప్పిన ఐదు రూపాయల శాలువా మిన్న

—తంబి వాసుదేవరావు

దేశ స్వాతంత్ర్య సమరకాలంలో తమ జీవితాన్ని తమ సర్వస్వాన్ని అర్పించిన నిష్కామ దేశభక్తులు తెలుగు దేశంలో ఎందరో జన్మించారు. అట్టివారిలో ఒకరు ఆంధ్ర నేతాజీగా పేరుపడిన మద్దూరి అన్నపూర్ణయ్యగారు. ఆయన మంచి వక్త. ముందు వెనుకలు ఆలోచించజాలని త్యాగ తత్పరత, నిప్పు వంటి నిజాయితీ. నిష్కామత ఆయన వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దాయి. బహుశః ఈ గుణాలే (బలహీనతలు) ఆయనను పదవులను అధిష్టించడానికి అడ్డుపడ్డాయి. అందుకు ఆయన విచారించలేదు. స్వాతంత్ర్యం వచ్చాక రాజకీయ బాధితులకు ప్రభుత్వం ఇవ్వచూపిన ఐదెకరాల భూమిని అన్నపూర్ణయ్య ఆశించలేదు తిరస్కరించారుకూడా. ఆయన ఒకసారి రాజమంద్రిలో జరిగిన స్వాతంత్ర్య సమరయోధుల సభలో ప్రసంగిస్తూ "నేనింత త్యాగం చేశాను, యిన్నిసార్లు జైలుకు వెళ్ళాను, లాఠీ దెబ్బలు తిన్నాను అంటూ సర్టిఫికెట్లతో రెవిన్యూమంత్రి కళా వెంకట్రావుగారికి అర్జీపెట్టుకుని భూమి సంపాదించి, త్యాగానికి విలువ కట్టించుకోవడం కన్న ప్రజలచే గుర్తింపబడి వారువేసే రూపాయిదండ ఐదు రూపాయల శాలువాతో సత్కరింపబడడంకన్న కావలసింది ఏమిటని అన్నారుట. దొంగ సర్టిఫికెట్లతో నకిలీ దేశభక్తులు ప్రభుత్వ ఖజానాను దోచుకుంటున్న ప్రభుత్వ సదుపాయాలు దుర్వినియోగపరచుకుంటున్న ఈ రోజులలో అన్నపూర్ణయ్యగారి వైఖరి ఆశ్చర్యం కలిగిస్తుంది.

దేశ సేవచేయడానికి డిగ్రీలు అవసరం లేదు. గుండె ధైర్యం, దృఢ సంకల్పం నిజాయితీ వుంటే చాలన్న అల్లూరి సీతారామరాజు భావాలను యువకుడైన అన్నపూర్ణయ్యను ప్రభావితం చేశాయి. చదువుకు స్వస్తి చెప్పారు. దేశ స్వాతంత్ర్య సమరంలో సమిధగా మారిపోవడానికి నిశ్చయించుకున్నారు ఆ రోజులలో సుప్రసిద్ధ దేశభక్తులు బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం గారు రాజమంద్రి సమీపంలోని సీతానగరంలో సబర్మతి పద్ధతిలో గౌతమీ ఆశ్రమాన్ని స్థాపించారు. అది ఆనాటి తూర్పు గోదావరి జిల్లా కాంగ్రెస్ కార్యకలాపాలకు, జాతీయఉద్యమానికి కేంద్రీభూతంగా వుండేది అందులో కొవ్విడి లింగరాజు, పాలక్‌పేట సూర్యప్రకాశరావు రామచంద్రుని వెంకటప్ప - యింకా ఎందరో అందులో వుండేవారు. ఆ ఆశ్రమంలో శిక్షణ పొందినవారు తర్వాత ప్రముఖ నాయకులయ్యారు అన్నపూర్ణయ్య గారు అక్కడ చేరి, తన రాజకీయ జీవితానికి శ్రీకారం చుట్టారు.

## జైలులో 14 సంవత్సరాలు

గౌతమీ ఆశ్రమం నుంచి కాంగ్రెస్ అనే పత్రిక వెలువడుతూ వుండేది. దానికి సంపాదకత్వ బాధ్యత అన్నపూర్ణయ్యగారిది కాగా, లింగరాజుగారు పూర్తి సహకారం ఇస్తూవుండేవారు ఆ పత్రికలోని వ్యాసాలు బ్రిటీష్ ప్రభుత్వంపై నిప్పులు చెరుగుతూ ప్రజలను ఉత్తేజపరచి వారిలో దేశభక్తిని ప్రదీప్తంచేస్తూవుండేవి. కాంగ్రెస్ పత్రిక రచనలు ఆనాటి బ్రిటిష్ అధికారులకు గంగవెర్రులు ఎత్తిస్తూ వుండేవి. కర్కశత్వానికి మారుపేరయిన ముస్తాఫా అలీఖాన్ సర్కిల్ ఇనస్పెక్టరుగా దప్పుల సుబ్బారావు సబ్ ఇనస్పెక్టరుగా వుండేవారు. సహజంగా అన్నపూర్ణయ్యగారు బ్రిటీష్ ప్రభుత్వ ఆగ్రహానికి గురిఅయ్యారు. జైలుశిక్షపడింది.

స్వాతంత్ర్య సమర సమయంలో మొత్తం 11 సంవత్సరాలు ఆయన జైలులో గడిపారు. ఇంత కాలం జైలు జీవితాన్ని గడపినవారు దేశంలోనే బహు కొద్దిమంది వుంటారు. జైల్లో వుండగానే భార్యా వియోగం సంభవించింది. ఆయన కుటుంబం అనేక ఆర్థిక చిక్కులకు గురిఅయింది. అయినా అన్నపూర్ణయ్య గారు చలించలేదు. మేరు నగధీరుడిగా నిలిచారు.

## అల్లూరి నుంచి స్ఫూర్తి

ఆయన అల్లూరి సీతారామరాజు నుంచి స్ఫూర్తి పొందేవారు. ఆయన కేవలం తిరుగుబాటుదారు కారని నిష్కళంక దేశభక్తులని ఆయన విశ్వాసం. చిత్రమేమంటే - అల్లూరి సీతారామరాజు పట్ల ఆనాటి కాంగ్రెస్ అగ్రనాయకులే కాదు రాష్ట్ర కాంగ్రెస్ నాయకులకు కూడా చిన్న చూపే. గాంధీజీ అహింసా విధానాల పట్ల ప్రభావితులయిన వారికి సీతారామరాజు సాయుధ పోరాటంపై సదభిప్రాయం వుండేది కాదు. కాంగ్రెస్ పత్రికలో సీతారామరాజు దేశభక్తి గురించి రాసినందుకు ఆయన ఆశ్రమ నిర్వాహకుల ఆగ్రహానికి గురిఅయ్యారు. అన్నపూర్ణయ్యగారు - మహాత్మా గాంధీకి ఒక ఉత్తరం రాస్తూ - సీతారామరాజు పోరాటాన్ని సరిఅయిన దృక్పథంతో చిత్రించారు. ఆ ఉత్తరాన్ని చదివి తన అంచనా తప్పు అని గుర్తించిన గాంధీజీ స్వయంగా ఇండియా పత్రికలో సీతారామరాజును ప్రశంసిస్తూ ఒక వ్యాసం రాశారు. దాంతో ఆనాటి ఆంధ్రనాయకులు తమ అభిప్రాయాన్ని మార్చుకున్నారు.

అన్నపూర్ణయ్యగారు తను నమ్మిన సిద్ధాంతాలకు కట్టుబడిన వ్యక్తి. 1938 ప్రాంతంలో కాంగ్రెస్ అధ్యక్ష పదవికి సుభాష్‌చంద్రబోసు, Ch పట్టాభిల మధ్య పోటీ జరిగినప్పుడు, అన్నపూర్ణయ్యగారు - ఆయన అనుయాయులు సుభాష్‌చంద్రబోసుకు, మహాత్మా గాంధి, తదితర కాంగ్రెస్ అగ్రనాయకుల అభీష్టానికి వ్యతిరేకంగా మద్దతు యిచ్చారు. పట్టాభి ఆంధ్రుడైనా కాంగ్రెస్ అధ్యక్ష పదవికి - సుభాష్ చంద్రబోసు అన్ని విధాల అర్హుడని అన్నపూర్ణయ్య త్రికరణశుద్ధిగా విశ్వసించారు. 1946 లో ఉమ్మడి మద్రాసు శాసన సభకు కాంగ్రెస్ తరపున పోటీ చేయడానికి కొందరు అన్నపూర్ణయ్య పేరును సూచించినప్పుడు కాంగ్రెస్ అధ్యక్ష పదవికి జరిగిన పోటీలో అన్నపూర్ణయ్య మహాత్మాగాంధీ అభీష్టానికి వ్యతిరేకంగా సుభాష్‌బోసుకు బలపరచడం అనర్హత అయింది.

## సోషలిస్టు నాయకులలో సన్నిహిత సంబంధాలు

ఆంధ్రలో కాంగ్రెస్ సోషలిస్టు నాయక ప్రముఖులలో అన్నపూర్ణయ్య ఒకరు. ఆనాటి కాంగ్రెస్ సోషలిస్టు నాయకుల జయప్రకాశ్ రామమనోహరలోహియా అచ్యుత్ పట్వర్ధనా వంటి ప్రముఖులతో సన్నిహిత స్నేహ సంబంధాలు వుండేవి. నేతాజీ సుభాష్‌చంద్రబోసు జయప్రకాశ్ నారాయణ ఆంధ్రదేశంలో పర్యటించినప్పుడు ఆయన వెంట అన్నపూర్ణయ్య వుండేవారు.

అన్నపూర్ణయ్యగారు పత్రికా సంపాదకులు. కాంగ్రెస్ కాక ఆయన నవశక్తి, జై భారత్, వెలుగు అనే పత్రికలు నిర్వహించారు. ఆయనను తెలుగువారు ఆంధ్ర నేతాజీ అని ఆప్యాయంగా పిలుచుకునేవారు.

ఈనాడే కాదు ఆనాడు కూడా కాంగ్రెస్‌లో త్యాగాలు చేసేవారు కష్టాలు, అనుభవించేవారు కొందరైతే, భోగాలు సుఖాలు అనుభవించేవారు కొందరు. లౌక్యం తెలియని కొందరు వారయితే లౌక్యంతో పదవులు పొందినవారు మరికొందరు. అన్నపూర్ణయ్యగారు మొదట తరగతికి చెందినవారు. తన నమ్మిన సిద్ధాంతాలకోసం కష్టాలను నష్టాలను చిరునవ్వుతో భరించారు. పేదరికం ఆయనను కుంగతీయలేదు. నిప్పులాంటి నిజాయితీ నిస్వార్థ దేశభక్తి అకుంఠిత కార్యదీక్ష. ఆయన నిబద్ధతలలో ఆయనకు సాటివచ్చే తెలుగు నాయకుడు బహుశ మరొకరు వుండకపోవచ్చు. ఆయన జీవితం కొందరికయినా స్ఫూర్తినిచ్చి త్యాగధనులను చేయగలిగితే భారత దేశ భవిష్యత్తు ఉజ్జ్వలంగా వుంటుంది.

పురాణవాణి-17

# సీమంతిని

మల్లాప్రగడ శ్రీరంగారావు

చిత్రవర్మయను రాజునకు సీమంతిని యను పేరుగల కూతురుండెను లేక లేక కలిగిన సంతానమగుటచే ఆమెను గారాబముగ పెంచుకొనుచు ఆమె భవిష్యజీవితమెలా వుంటుందో తెలుసుకుందామని ఒకనాడు జ్యోతిష్కులకు చూపించి అడిగెను. ఆమెకు వైధవ్యము కలుగునని వారు చెప్పిరి.

ఆ మాటకు తండ్రి చాల దుఃఖించి ఆ సంగతి కూతురుకు తెలియచేయకుండ జాగ్రత్తపడెను. కాని చివరకామెకీవార్త తెలిసెను. నాటి నుండి ఆమె సోమవారాలు ఉపవాసముండి శివునకభిషేకము, పూజలు భక్తితో చేయుచుండెను. కొన్నాళ్ళకు తండ్రి సీమంతిని చంద్రాంగదుడను రాజకుమారునకిచ్చి వివాహంచేసెను. తన కూతురును అల్లుని తన యింటనే యుంచుకొని వారికేవిధమైన యాపద రాకుండ జాగ్రత్తగా చూచుచుండెను.

ఇట్లుండగా ఒకనాడు చంద్రాంగదుడొకనావ యెక్కి సముద్రములో ప్రయాణం చేయుచుండగా పెనుగాలి వచ్చి ఆ పడవ మునిగిపోగా చంద్రాంగదుడేమైనాడో తెలియలేదు. అందరు ఆతడు మరణించివుంటాడని భావించారు. ఈ వార్త తెలిసి శత్రురాజులు దండెత్తి వచ్చిరి. సీమంతిని అంతటి దుఃఖములో ఉన్నా శివుని ఆరాధన మాత్రం మానలేదు

సముద్రంలో మునిగిపోయిన చంద్రాంగదుని సర్పజాతి చూచి నాగలోకమునకు తీసికొనిపోయెను సర్పరాజైన తక్షకుడు చిత్రవర్మకు మిత్రుడగుటచే తన మిత్రుని అల్లుడైన చంద్రాంగదుని అనేక విధాల గౌరవించి చిత్రవర్మకు అతని వృత్తాంతమును తెలిపి నిజనగరానికి వస్తున్నట్లు ఉత్తరం వ్రాసి పంపెను. ఆ వార్త విని చిత్రవర్మ మొదలగువారందరు చాల సంతోషించి అతని రాకకై వీక్షించుచుండగా చంద్రాంగదుడు వచ్చి అందరిని చూచి పలుకరించి నాగలోక విశేషములను తెలియచేసి సీమంతిని యెక్కడ వున్నదని అడిగి శివుని పూజించుచున్న ఆమె వద్దకు వెళ్ళెను. అతడు తన భర్తయని ఆమె గుర్తించక శివుని ప్రార్థించుచు దీనముగ నుండెను.

అపుడు చంద్రాంగదుడామెను చూచి యెందులకిట్లు బాధపడుచున్నావని అడిగెను. ఆమె తన భర్తకు సంభవించిన యాపదకై బాధపడుచుంటినని చెప్పగా, చివరకు చెలికత్తెల వలన అతడే తన భర్తయైన చంద్రాంగదుడని తెలుసుకొని శివుని దయచే అతడు బ్రతికి వచ్చినాడని భావించి భగవంతుని స్తుతించి పతి పాదాలకు నమస్కరించెను.

భర్త బ్రతికి వచ్చిన సంతోషంతో సీమంతిని తన యింటికి వచ్చిన దంపతులకు పూజచేసి యథాశక్తి కానుకలిచ్చి గౌరవించుచుండెను. ఇంతలో ఇద్దరు సోదరులు ధనార్జనకై తిరుగుచు యీ వార్త విని దంపతుల వేషం వేసి సీమంతిని యింటికి వచ్చిరి. ఆమె వారిని దంపతులుగా భావించి పూజించి కానుకలివ్వగా ఆడు వేషము వేసుకొనినవాడు నిజముగ స్త్రీయయ్యెను. సీమంతిని దంపతులుగా భావించి పూజించుటచే వారు నిజముగ దంపతులైరి.

స్కాందపురాణములోని యీ కథ వలన పతివ్రతకు ఎంతటి మహిమ కలదో మనం తెలుసుకొనగలము.

# జ్ఞానగిరి

( గత సంచిక తరువాయి )

సెంట్రల్ జైలు, రాజమండ్రి
ది 12-12-76

చిరంజీవులకు ఆశీస్సులు.

విద్య జ్ఞానాభివృద్ధికే గాని ఉద్యోగ్యం చేయడానికి మాత్రమే కాదు. అనే విషయాన్ని గురించి లోగడ ఉత్తరములో వ్రాశాను. అసలు జ్ఞానం అంటే ఏమిటి? అనే ప్రశ్న మీ మనస్సులలో సహజంగా ఉద్భవించవచ్చును. ఈ ఉత్తరములో దీనిని గురించే వివరించ దలిచాను. జ్ఞానమనగా ప్రకాశము, కాంతి, వెలుగు అని అర్థము చెప్పుకుంటే బాగుంటుంది. మానవునికి జ్ఞానమే నిజమైన శక్తి. ఒక్కొక్క వస్తువునకు సంబంధించిన వానినెల్లను కనుగొనుటయే జ్ఞానము వ్యక్తి సంబంధమును గుర్తించుటయే జ్ఞానము. మన మనస్సులలో ఉన్న పాత అనుభవాలను క్రొత్త అనుభవాలను తీసుకొనివచ్చి కలుపుకొనుటయే జ్ఞానము ఇట్టి జ్ఞానమును సంపాదించవలెననిన తీవ్రమైన కృషి మాత్రం అత్యవసరం. అసలు ప్రకాశం, కాంతి, వెలుగు మనిషిలో ఎలా వస్తుంది? వేద వేదాంగములు, ఉపనిషత్తులు, ఆధ్యాత్మిక శాస్త్రములు, స్మృతులు, పురాణములు, ఇతిహాసములు, మహానుభావుల చరిత్రలు, భౌతిక విజ్ఞాన శాస్త్రములు, మానసిక శాస్త్రములు మొదలగు ఎన్నో ముఖ్యములగు గ్రంథములను వినుటవలన, పఠించుట వలన ఈ జ్ఞానము మనిషిలో కలుగుతుంది శ్రుతి, శాస్త్రములే జ్ఞానము అని పెద్దలు చెబుతున్నారు అట్టి జ్ఞానమే నిజమైన, వాస్తవికమైన విద్య అందు కోసమనే జ్ఞానమనగా శాస్త్రజన్య జ్ఞానమన్నారు అనుభజ్ఞులు. అనగా శాస్త్రములు చదివినందువల్ల వచ్చిన జ్ఞానమని అర్థము. ఇది ప్రత్యక్ష జ్ఞానం మాత్రం కాదు పరోక్ష జ్ఞానమే,

" జ్ఞానేన హీనాః పశుభిస్సమానాః " జ్ఞాన హీనులైనవారు పశువులతో సమానము జ్ఞాన విజ్ఞానములతో సమానమైన వస్తువు ఈ ప్రపంచములో మరొకటి లేదు. మొట్టమొదట జ్ఞాన స్వరూపాన్ని వివరిస్తాను. దీని ఆవశ్యకతను గురించి భగవద్గీతలో "నహి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే " అని వున్నది. అనగా " ఈ ప్రపంచమున జ్ఞానముతో సమానంగా పవిత్రమైనది లేనే లేదు కదా! " అని అర్థం. ఈ ప్రపంచంలో ప్రతి వ్యక్తికి పవిత్రమైన వస్తువులెన్నో ఉన్నాయి. అతి ప్రియమైనవి కూడా వున్నాయి. వాటి అన్నిటి కన్నా పరమ పవిత్రమైనది, అతి ప్రియమైనది, మానవునికి వెలుగు ప్రసాదించునది ఒక్క జ్ఞానము మాత్రమే కనుక అట్టి పరమోత్కృష్టమైన జ్ఞానమును పుట్టిన ప్రతి వ్యక్తి సంపాదించి తీరవలెను. జ్ఞానమే జీవుల చరమ లక్ష్యము. అసలు ఈ జ్ఞానమనే తేజస్సు మనిషిలో ఎలా ప్రవేశిస్తుంది? గీతలో చక్కటి సమాధానం ఉన్నది. "శ్రద్ధావాన్ లభతే జ్ఞానం" శ్రద్ధగలవాడే జ్ఞానమును పొందగలుగుతాడు. ఏ కార్యమును సఫలీకృతమొనర్చవలెనన్నిన "శ్రద్ధ" అత్యవసరం ఏ విద్యార్థి అయినాసరే మంచి మార్కులతో పరీక్షలో ఉత్తీర్ణుడవ్వాలంటే ' శ్రద్ధ ' ముఖ్యము. ఆ శ్రద్ధ ' వున్నప్పుడే సత్ఫలితాలు కలుగుతాయి. ఈ శ్రద్ధతో పాటు "ఏకాగ్రత" (Concentration) కూడా తప్పనిసరిగా వుండాలి. తన శక్తి, యుక్తులనన్నింటిని ఒకచోట కేంద్రీకరించాలి. ఇంట్లో అమ్మ చేసిన

పిండివంటలమీదను గాని, బడిలోని ఆటలమీదను గాని మనస్సును పోనివ్వరాదు. ఏ పని చేస్తుంటే, ఆ పని మీదనే తన యావత్ దృష్టినీ కేంద్రీకరించి, శ్రద్ధతో, పట్టుదలతో వ్యవహరించిన యెడల, ఆ పని నిర్విఘ్నంగా విజయవంతమౌతుంది. మంచి ఫలితాలు చేకూరుతాయి

"జ్ఞాత్వా శాస్త్ర విధానోక్తం" అనగా శాస్త్రము నందు చెప్పబడిన దానిని తెలుసుకొనుము అని అర్థము. ఏ పని అయినా సరే చేయవలసివచ్చినప్పుడు, అది చేయదగినపనో, లేక చేయకూడనిపనో తేల్చుకొనవలె నని, అప్పుడు శాస్త్రమును ప్రమాణముగా తీసుకొన వలెను. ఆ శాస్త్రము ననుసరించి మనము చేయు పనులు మంచివో, చెడ్డవో నిర్ణయించుకొనవలెను అటువంటి ఆలోచనాజ్ఞానము శాస్త్రములు చదవడంవల్ల లభ్యమవు తుంది అందువలన మన శాస్త్రములు మానవ పురోభి వృద్ధికి ఏ విధంగా ఉపకరిస్తాయో పరిశీలిద్దాం ఎటువంటి జ్ఞానమును ప్రబోధిస్తున్నాయో కొంచెం ఆలోచిద్దాం అట్టి [illegible] జ్ఞానమువల్ల విద్యార్థుల మనస్సు వి సిస్తుంది. బుద్ధి అభివృద్ధి చెందుతుంది.

"మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవో భవ" అని శాస్త్రములు చెబుతున్నాయి వీటిని గురించి పరిశీలిద్దాం.

## 1. గురుభక్తి

ప్రతి విద్యార్థి గురువు యందు భక్తిశ్రద్ధలు కలిగి వుండవలెను జ్ఞానార్జన గురు సేవ అత్యవసరము శాస్త్ర ములలో ప్రవచించిన జ్ఞానమును అర్థం చేసుకోవడానికి గురువు సహాయం ఎంతయినా అవసరం. అట్టి అనుభ వజ్ఞుని అనుగ్రహము పొందుటకు ప్రతి విద్యార్థి ప్రయ త్నించవలెను. వినయముతో నమ్రతతో, అణకువతో, మెలకువతో, వారి మెప్పును పొంది జ్ఞానార్జన చేయవలెను వారు మార్గమును మాత్రం చూపుతారు. నడువవలసినది ఎవరికి వారే అనే విషయం మాత్రం విస్మరించరాదు. ఎవరి కాళ్ళమీద వారే నిలబడాలి. తన జ్ఞానమంతా పూర్తిగా గురువుమీదనే నేలా [illegible] గురువు యొక్క అమూల్యమైన సలహాలను, సూచనలను తీసుకొని భక్తి శ్రద్ధలతో స్వశక్తిమీద ముందుకు సాగిపోవలెను గురు భక్తికి చక్కటి ఆదర్శం "ఏకలవ్యుడు"

ద్రోణాచార్యులు విలువిద్య నేర్పడానికి నిరాకరించినప్పటికి నిరుత్సాహ పడక అతని విగ్రహమును మాత్రం ముందుంచుకొని, కృషి సల్పి సాటిలేని మేటి విలుకాడయ్యాడు స్వశక్తితో, స్వబుద్ధితో ఆరితేరిన గొప్ప విలువిద్యా నేర్పరయ్యాడు ద్రో చార్యులు అతని విలువిద్యా నైపుణ్యానికి ఆశ్చర్యపడి మెచ్చుకొని, పారితోషికంగా బొటనవ్రేలును కోరగా, ఏమాత్రం సంకోచించకుండా, విలువిద్యకు అత్యవసర మైన ఆ బొటన వ్రేలును కోసి యిచ్చివేశాడు. ఏ విలువిద్యకోసం సంవత్సరాల తరబడి, ఏకాగ్రచిత్త ముతో ఎనలేని తీవ్ర కృషి సలిపాడో, అట్టి ఆ విలు విద్యకు ఆధారమైన బొటన వ్రేలును సహితము, ఎట్టి విచారమూ లేకుండా కోసి యిచ్చిన మహా త్యాగి నిరంతర కృషిచే సాధించిన ఆ విలువిద్య ఆనాటితో పరిసమాప్తి అవుతుందని తెలిసికూడా, ఏమాత్రం బాధ పడకుండా, అడగడంతోనే ధైర్యంగా తన బొటన వ్రేలను కోసి ద్రోణాచార్యుని పాద పద్మములకు సమర్పించిన గొప్ప ధీశాలి, త్యాగశీలి, గురుభక్తి పరాయణుడు "ఏకలవ్యుడు". కనుక ప్రతి విద్యార్థి అనన్యమైన భక్తిశ్రద్ధలు గురువుయందు వుండవలెను. గురువాజ్ఞను శిరసావహించవలెను

## 2. మాతృభక్తి

ఎంతో శ్రమపడి నవమాసములు మోసి, కని ఎంతో ప్రేమలో లాలించి, పెంచి పెద్దవారిని చేసిన తల్లిని ప్రతివారు ప్రేమించి, గౌరవించి పోషించాలి అనాది నుంచి మన దేశంలో మాతృదేవతకు మకుటాయమాన మైన స్థానం యివ్వబడింది. తల్లికి మించిన దైవము

లేదని శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. మన దేశాన్ని కూడా "మాతృభూమి" (Mother Land) గా భావించి పూజించడం మన సాంప్రదాయం. ఇటువంటి మాతృ భావన ప్రపంచంలో మరెక్కడా కనుపించదు. ఇతర దేశములవారు తమ దేశమునకు "పితృభూమి" (Father Land) గా భావిస్తారు. దీనినిబట్టే మన దేశంలో స్త్రీకి ఎటువంటి గౌరవమర్యాదలు మనవారు యిచ్చారో అర్థం చేసుకొనవచ్చు. మన దేశంలో స్త్రీని తల్లిగా భావిస్తారు. ఇతర దేశములలో ఒక భోగ్య వస్తువుగా పరిగణిస్తారు. శివాజీ, అభిమన్యుడు, బాల చంద్రుడు లాంటి వీరాధివీరులు తయారు కావడానికి మూలకారణం వారి మాతృమూర్తులే అనే విషయం విస్మరించరాదు. కనుక మీ యోగక్షేమములను, ఆయురారోగ్యములను, అభివృద్ధిని మనసా, వాచా కోరుకుంటున్న మాతృమూర్తిని పూజించడం మీ విద్యుక్త ధర్మం.

### 3. పితృభక్తి

జన్మ యిచ్చిన తండ్రిని కూడా గౌరవించి పూజించాలి. చదువుకు, అభివృద్ధికి అనుక్షణము శ్రమించి, కష్టించి, సంపాదించిన డబ్బును తాననుభవించక పిల్లల భవిష్యత్తుకు ఖర్చు చేసే తండ్రిని మనసారా ప్రేమించాలి. పితృవాక్య పరిపాలనకు మంచి ఆదర్శం శ్రీరామచంద్రుడు. తన తండ్రి ఆజ్ఞను శిరసావహించి, సకల భోగ భాగ్యములను, రాజ్యమును తృణప్రాయంగా భావించి 14 సం॥లు అరణ్యవాసం చేసిన ఆదర్శ పురుషుడు. హంసతూలికాతల్పాలమీద శయనించవలసిన అతి సుకుమారి సీతాదేవి శ్రీరాముని అనుసరించి కీకారణ్యములలోని రాళ్ళమీద శయనించి, ఎన్నో కష్టాలననుభవించిన ఆదర్శ సతీభక్తిపరాయణురాలు సీతాదేవి. మణిమయ సౌధాలలో, పంచమాగధుల కైవారాలతో మంగళవాయిద్యములతో పరిచారికాగణం పసిడి వీవనలు వీస్తుంటే, మధుర నాదాల వీణాస్వరాలతో, మృదుమధురమైన గానాలను ఆస్వాదిస్తూ, సకల రాజభోగములను అనుభవించవలసిన శ్రీరాముడు పితృవాక్య పరిపాలనకు తలవంచి, కాకులు దూరని కారడవిలో, అతి క్రూర మృగములు విచ్చలవిడిగా సంచరిస్తున్న కీకారణ్యములలో, పరమ కిరాతకులైన రాక్షసమూకలకు నిలయమైన మహారణ్యములలో 14 సం॥లు జీవితాన్ని గడిపి చక్కటి ఆదర్శమును లోకానికందించిన పితృభక్తిపరాయణుడు శ్రీరామచంద్రుడు. కనుక ఆ మహనీయుని అడుగుజాడలలో నడవడం ప్రతి వారి కర్తవ్యం. (సశేషం)



ఇంకొల్లు శేషగిరిరావు
J.T.O. (Telecom)
నారాయణఖేడ్



జీవిత సభ్యులు



Dr. M. Panduranga Vittal
Prof. Finance & Customs
I I M C. JOKA, ALIPUR (P O.)
CALCUTTA - 700 027 W. Bengal

# .... దేహిమే హవ్యవాహన

డా॥ రాపర్ల జనార్ధనరావు

అగ్నిని పూజించటం ప్రాచీన భారతీయ సంస్కృతి యందలి ఒక ముఖ్యభాగము. వివాహాది శుభకార్యములనుండి పితృకార్యముల వరకు, అగ్నిపూజ చేయటం మన ఆచారం. దీనినే 'హోమం' అంటాము. అగ్నిహోత్రుని పూజించటం, హోమాగ్నిలో నెయ్యి, సమిధలు పరిమళద్రవ్యాలు సమర్పించి 'స్వాహా' అనెడి మంత్రాలు పఠించటం మన ప్రాచీన సంప్రదాయం.

"దేహిమే హవ్యవాహన" అనెడి మంత్ర భాగాన్ని పరిశీలిద్దాం మే అనగా నాకు, హవ్యవాహన (అగ్నిదేవా) దేహి, ఇమ్ము అనెడి ప్రార్థన అగ్నిదేవుని ఉద్దేశించి, "దేవా నాకు వీనిని ఇమ్ము" అని సాధకుడు ప్రార్థించుచున్నాడు. అగ్ని దేవుని ఆహ్వానించి భక్తుడు ఏమేమి అడుగుచున్నాడు అనెడి విషయం తెలిసుకుందాం

"స్వస్తిం, శ్రద్ధాం, మేధాం, యశః, ప్రజ్ఞాం,
విద్యాం, బుద్ధిం శ్రియం, బలం, ఆయుష్యం
తేజ, ఆరోగ్యం, దేహిమే హవ్యవాహన
శ్రియం దేహిమే, హవ్యవాహన ఓంనమఃఇతి"

అగ్నిహోత్రుని ఆహ్వానించి పైన పేర్కొనబడిన సుగుణ సంపత్తిని నాకు అనుగ్రహించుము అగ్నిదేవా యని ఆర్యుడు ప్రార్థించుచున్నాడు స్వస్తి అనగా లటలు తదుపరి శ్రద్ధ అనెడిది ఏ విధమైన విజయానికైనను ప్రధానమైన విషయము కదా ! భగవద్గీతయందు 'శ్రద్ధావాన్ లభతే జ్ఞానం' అని శ్రీ కృష్ణపరమాత్మ తెల్పుచున్నాడు. అనగా శ్రద్ధ కలవానికే జ్ఞానము లభించునని అర్థము. తదుపరి మేధాం అనగా మేధస్సు, యశః అనగా కీర్తి, ప్రజ్ఞ తెలివితేటలు కార్యములందు చాతుర్యము, విద్యాం, విద్య, బుద్ధిం మంచి భావాలు మంచి బుద్ధి, మంచి సంకల్పములు, శ్రియం అనగా శుభము లేక మేలు కలగటం, బలం, ఆయుష్షు, తేజము, ఆరోగ్యము, దేహిమే హవ్యవాహన అనగా ఓ అగ్నిదేవా (ఈ సద్గుణములను) నాకు ఇమ్ము" అనెడు ప్రార్థన ఎంత ఘనమైనదియో తెలిసికొనవచ్చును.

ప్రాచీన భారతీయుడు సుగుణ సంపదయందలి వివిధ లక్షణములను విడివిడిగా పేర్కొని ఇవి తనకు కావలెనని భావించి, వానిని అనుగ్రహింపుము అగ్నిదేవా యని ప్రార్థించుచున్నాడు. మన కోర్కెలను బట్టి మన శీలమును తెలియనగును ఉన్నత భావుకులకు ఉత్కృష్ట భావ సంపద ప్రేరకమగును. నికృష్టులకు నికృష్ట భావములు ప్రేరేపణకారులగును. పైన తెల్పిన ఉత్కృష్ట లక్షణములన్నియు వ్యక్తి సంపూర్ణ జీవనపరిణామమునకు ముఖ్యావశ్యకములు.

స్వస్తి అను శబ్దమునకు ఎంతయో నిగూఢము, విపులార్థమున్నది. శుభము, శాంతి, నిశ్చలత కలిగిన వానిని స్వస్తి అని చెప్పవచ్చును. స్వస్తివాచకము పఠించుట మనము చూచుచున్నాము. స్వస్తిక్ అనెడి గుర్తు, చిహ్నము ఆర్షసాంప్రదాయమైనది, దానిని వక్రీకరించి హిట్లర్ అపజయముపాలైనాడు. ఇక శ్రద్ధ విషయమునకు వచ్చినచో శ్రద్ధలేనివానికి వృద్ధి లేదు మేధస్సు లేనివాడు జడుడు. యశస్సు లేక కీర్తి జీవితమునకు నిజమగు ఆనందము పరిపూర్ణత లభించును. కీర్తి కాముకత్వము ఒక సులక్షణము. ప్రజ్ఞ లేక కుశలత కార్యనిర్వహణయందు అత్యంతావశ్యకము. గీత యందు "యోగః కర్మసుకౌశలం" అని తెల్పబడింది. యోగమనగా ముక్కు మూసుకొని ధ్యానించుటయే కాదు. చేసెడి కర్మలను కౌశలముతో చేయుటయే

నిజమగు యోగము అని శ్రీకృష్ణపరమాత్మ సెలవిచ్చి యున్నాడు గుండెకాయ మార్పిడి సుమారు పదిగంటలు ఎంతో మెలకువతో సూక్ష్మమైన నరములను ఛేదించి మరల అనుసంధించి రోగి ప్రాణమునకు పునఃశక్తిని తీసికొనిరాగలిగిన డాక్టరు క్రిష్టియన్ బర్నార్డ్‌ను యోగి యనుటలో సందేహము లేదు అటులనే అన్ని రంగములందును, అమోఘమగు కౌశల్యము లేక ప్రజ్ఞ చూపెడివారియందరిలో అనిర్వచనీయమైన ఒక ఏకాగ్రత, దీక్ష, అనెడి యోగశక్తి కలదని మనము గ్రహింప వచ్చును. ప్రాచీన భారతీయుడు వర్చస్సు నిమ్ము తేజమునిమ్ము అనెడి ప్రార్థన తరచు చేయుట మన సాంప్రదాయ విశేషము. జీవితమంతయు తేజోపాసనకే ప్రాచీనులు వినియోగించియున్నారు. తదుపరి ఆరోగ్యము అనుగ్రహింపుమని ప్రార్థన. ఆరోగ్యము లేని వ్యక్తి ఇహ, పర సాధనలకు అనర్హుడగుచున్నాడు. అందు వలననే "యోగి" అనెడియతడు "నిరోగి"యై ఉండ వలెనని నాడీశుద్ధి, మలశుద్ధి ద్వారా చేయవలనని యోగ శాస్త్రమునందు తెలుపబడినది. మనము మన శరీర ఉష్ణము 98.4 డిగ్రీలు ఉన్నప్పుడే అన్ని పనులు సులభముగ చేయుచున్నాము. 99 డిగ్రీలు వచ్చిన చాలు మన ఆరోగ్యమేదో సరిగ లేదని భావించెదము. "ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్" ఆరోగ్యము సూర్య దేవుని సత్ఫలము గనుక సూర్యనమస్కారము, సూర్యోపాసన, సూర్యహితమగు సాత్వికాహార సేవన మున్నగునవి ప్రధానములని తెలుపబడినవి.

అగ్నిహోత్రుని ప్రాచీన భారతీయుడు పైన పేర్కొనబడిన సుగుణలన్నింటిని తనకు అనుగ్రహింపుమని ప్రార్థించుట ఋషి సంతతి యగు మనము కూడ, నేడు ఆ లక్షణములను ఆకాంక్షించుట ఎంతయో ఆవశ్యకము.

నందివాడ వెంకటరమణ

## ఆణిముత్యాలు.

- ఒక గుహలో ఏకాంతవాసమొనర్చుటకంటే ఈ ప్రపంచమునందుండియే మానవసేవ యొనర్చుట పరమోత్కృష్టమైయున్నది.

స్వామి శివానంద

- విశ్వాసము లేని ప్రార్థన నిర్జీవప్రాయమైయుండును.
- సహాయకరమైన పలుకు పలుకుము. సంతోషకర మైన నవ్వు నవ్వుము. దయాపూరితమైన కార్యము నొనర్చుము. కొద్ది కొద్దిగా సేవ చేయుము.

స్వామి శివానంద

- ఓ మోహగ్రస్తుడవై యున్న మానవుడా! జంతువులను చంపకుము. కాని నీ యందున్న అహంకార మనెడి జంతువును చంపివేయుము.
- ప్రార్థన అనగా అడుగుట కాదు. జీవాత్మ పరమాత్మ యందైక్యమగుటకు పరితపించుటయే ప్రార్థన యనబడును.
- సర్వతీర్థస్థానములు మరియు సమస్త దేవతలు గురువునందు వసించును.
- శీలమే గొప్ప శక్తియైయున్నది. అందువలన ఉజ్వలమైన శీలమును పెంపొందించుకొనుము.
- గౌరాంగునివలె కీర్తన చేయుము. రాధవలె గానము చేయుము. ప్రహ్లాదునివలె ప్రార్థించుము.
- మనస్సు నిశ్చలమొనర్చి, దానిని భగవంతునిపై కేంద్రీకరించుటయే సాధనయనబడును.
- నీకు దేవుడు కావలసియున్నచో సమస్త ప్రాణులను ప్రేమించుము నీకు ఆనందము కావలసియున్నచో పతితులను సేవింపుము.
- ముఖము మనస్సుయొక్క విషయసూచిక వంటిది నేత్రము ఆత్మయొక్క దర్పణము వంటిది.
- నీవు ద్వేషించబడుటకు ఇష్టపడవు కావున ఇతరులను నీవు ద్వేషింపకుము

# చ్యవన మహర్షి

పురాణపండ "శ్రీచిత్ర

పూర్వకాలమున భృగువను పేరుగల మహర్షి ఉండేవాడు. ఆయన భార్య పులోమ. పులోమ భర్తను సేవించి ఆయన అనుగ్రహ విశేషంచే ఒక కుమారుని కన్నది. ఆ బాలునకు ఆ దంపతులు చ్యవనుడని నామకరణం చేశారు భారతం ఆదిపర్వమందు ఈతని జన్మకథ వివరంగా వుంది

పుట్టిన బిడ్డ తల్లిపాలు తాగుచూ పెరిగి పెద్దవాడగు చున్నాడు. తండ్రి తనయునకు ఉపనయనం చేశాడు. తల్లిదండ్రులకు నమస్కరించి చ్యవనుడు ఒక సరోవర ప్రాంతాన వేల సంవత్సరములు తపోనిష్ఠలో ఉండి పోయాడు. తపస్సు చేయుచూ వృద్ధుడయిపోయాడు. అతని దేహము చుట్టు పుట్టలు బయలుదేరాయి. ఆ విషయము చ్యవనునకు తెలియదు.

కాలం గతిస్తోంది. ఒకనాడు సంయాతి యను రాజు తన భార్యలతోను కూతురగు సుకన్యతోను ఆ సరోవర మున జలక్రీడార్థమై అచ్చటకు వచ్చాడు. అపురూప సౌందర్యవతి యగు సుకన్య చెలికత్తెలతో ఆ ప్రాంత మంతయూ తిరుగుచూ చ్యవనుడున్న పుట్టవద్దకు వచ్చింది వచ్చిన సుకన్య పుట్టలో ఉన్న చ్యవన మహర్షి నేత్రములు ఏవో పురుగులని భ్రమించి పొడిచినది. అంత చ్యవనుడు సంయాతి పరివారమునకు మూత్రపురీష నిరోధముగావించాడు. అందరికందరూ భయభ్రాంతులై తిరుగుచుండగా సుకన్య వచ్చి జరిగిన విషయము చెప్పగా రాజు చ్యవనుని క్షమింపుమని ప్రార్థించాడు. సుకన్యను తనకిచ్చి వివాహము చేయ మనగా రాజు అందుకు అంగీకరించినాడు.

సుకన్య - చ్యవనుల వివాహము అతి వైభవంగా జరిగినది. రాజు తన కూతురును అచట విడిచి తాను తన నగరమునకు వెళ్ళిపోయాడు. సుకన్య వృద్ధుడైన తన భర్తను సేవిస్తూ జీవితం గడుపుతుంది.

సుకన్య అందగత్తెయను విషయము అశ్వనీకుమారు లకు తెలియగా వారిద్దరూ చ్యవనాశ్రమమునకు వచ్చారు. ఒంటరిగా ఉన్న సుకన్యను పరీక్షింపగోరి సుందరీ! ఈ వృద్ధునితో నీవు సుఖించుట కల్ల. నీవు అనుమతించిన యౌవ్వనుని తెచ్చి నీ భర్తగా చేయగలము. అనగా విని సుకన్య చ్యవనుడే తన సర్వస్వమని పలికినది. అనంతరం అశ్వనీదేవతలిద్దరూ, చ్యవనుడు సమీపాన గల సరోవరమందు మునిగి తేలిరి. ముగ్గురూ ఒకే పోలికగా ఉన్నారు. సుకన్య గ్రహించి తన భర్తనే వరించినది. అంత అశ్వనీకుమారులు సుకన్య పాతివ్రత్యమునకు ఎంతగానో సంతోషించి వెళ్ళి పోయారు.

చ్యవనుడు యౌవనవంతుడయ్యాడు. తన యౌవ నానికి కారకులైన అశ్వనీదేవతలకు ప్రత్యుపకారం చేయాలని నిశ్చయించుకున్నాడు. అంతవరకూ అశ్వనీ దేవతలకు సోమపానార్హత లేదు. ఆ విషయం తెలుసు కొని చ్యవనుడు వారికి ఆ అర్హత కలుగచేస్తానని పలికి నాడు. మామగారిచేత యజ్ఞం చేయించి ఇంద్రాదులతో పాటు అశ్వనీదేవతలకు కూడా సోమమీయబోయాడు. ఇంద్రుడు అందుకు కోపించి వారికి ఆ అర్హత లేదని పల్కాడు. అయినా చ్యవనుడు వారికి సోమపానార్హత కలుగజేశాడు.

ఇంద్రుని కోసం యిసుమడించింది. దాంతో చ్యవనుని తన వజ్రాయుధంతో సంహరింపబూనాడు. అంత చ్యవనుడు తన తపోశక్తితో ఒక రాక్షసుని సృష్టించి ఇంద్రునిపై ప్రయోగించాడు ఆ రక్కసుడు ఇంద్రుని కబళించబోయాడు ఇంద్రుడు భయపడి చ్యవనుని పాదాలపైబడి శరణు వేడి అశ్వనీ దేవతలకు సోమపానార్హత ఉంటుందని పలికాడు. చ్యవనుడు ఆదేశించగా రాక్షసుడు అంతర్థానమైనాడు అశ్వినీదేవతలు చ్యవను అభినందించి అంతర్ధానమయ్యారు

సుకన్య - చ్యవనులు హాయిగా జీవయాత్ర సాగిస్తున్నారు. అంత కొంత కాలమునకు చ్యవనుని కృపావిశేషంచే సుకన్య గర్భవతి అయినది దధీచి, ప్రమతి అప్రవానులను ముగ్గురు కుమారులను కన్నది. చ్యవన మహర్షి దయావిశేషంచే నహుషుడను రాజు ఇంద్రుడయ్యాడు. కుశికుడను రాజును అనేక బాధలు పెట్టి అతనిని పరాభవించగా ఆ రాజు చ్యవనుని ధాటికి ఆగగలిగాడు రాజుతోపాటు అతని భార్యకూడా ధైర్యంగా నిలబడింది అందుకు చ్యవనుడు ఆ రాజదంపతులను ఆశీర్వదించి నీ వంశము వృద్ధికాగలదని, పరశురాముడు, విశ్వామిత్రుల వంటివారు జన్మించగలరని పలికాడు.

చ్యవనుడు నర్మదానదిలో స్నానం చేయుచుండగా ఒక పెద్ద పాము అతనిని పాతాళమునకు తీసుకొని పోయి విడిచిపెట్టింది. అప్పుడు పాతాళమును ప్రహ్లాదుడు పరిపాలిస్తున్నాడు, అతడు చ్యవనమహర్షిని సగౌరవంగా పూజించి మహర్షీ ! మీ రాకతో ధన్యుడనయ్యాను. అని మౌనం వహించాడు.. అనంతరం ప్రహ్లాదుడు చ్యవనుని ముఖతః తీర్థయాత్రల యందలి పరమార్థం తెలిసికొని సపరివారముగా తీర్థయాత్రలు చేయనారంభించాడు.

మధుడను రాక్షసునకు రావణుని సోదరితో వివాహము ఆయినది. ఆమె పేరు కుంభాసిన మధుడు శివుని మెప్పించి ఒక శూలమును సంపాదించాడు శూలము చేతిలో ఉన్నంతవరకూ మధు రక్కసుని ఎవరూ సంహరించలేరు. అది శివుని వరం. వర గర్వితుడై మధురాక్షసుడు స్వేచ్ఛగా సంచరిస్తున్నాడు. కుంభాసిన లవణాసురుని కన్నది. వాడు తండ్రిని మించిన తనయుడు తండ్రి అనంతరం శూలమును పూజించి దాని ప్రభావంతో సాధువులను బాధించడం ప్రారంభించాడు వాడు పెట్టు హింసలకు ఋషులు భయపడసాగారు వాడిని సంహరించే మార్గం తెలియచేయ చ్యవనమహర్షిని అర్థించగా - " ఓ ఋషులారా ! శూలం వాడి చేతిలో లేని సమయాన లవణుని చంపే ప్రయత్నం చేయండని పలికాడు. శ్రీరాముని సోదరుడు శత్రుఘ్నుడు చ్యవనుని మాట విని లవణునితో పోరి శూలం లేని సమయం గ్రహించి వాడిని వధించాడు. చ్యవనుని ఉపాయం కారణంగా లవణాసురుడు మరణించాడు ఋషులు ఆనందించారు.

చ్యవనమహర్షి తపోబలంముందు ఇంద్రుని శక్తి ఏమాత్రం పనికిరాలేదు. అనేకమార్లు ఇంద్రుడు చ్యవనుని బాధింప యత్నించి విఫలుడయ్యాడు. చ్యవన మహర్షి లోకోపకారకమైన పనులెన్నో చేశాడు. రాక్షస సంహారానికి సహాయకారిగా నిలబడ్డాడు అటువంటి పవిత్ర మహర్షి చరిత్ర లోకారాధ్యమైనది

## విదురనీతి

" వృత్తం యత్నేన సంరక్షేత్
విత్తమేతి చ యాతి చ
అక్షీణో విత్తతః క్షీణో
వృత్తతస్తు హతో హతః "

సదాచారమును గొప్ప ప్రయత్నము చేతనైనను రక్షించవలెను ధనము వచ్చును, పోవును. ధనహీనుడైనను సత్ప్రవర్తన కలిగియున్నవాడు క్షీణుడుగా లెక్కింపబడడుకాని, ధనము సమృద్ధిగానుండియు సదాచారము లేనివాడు నశించిపోయినవాడుగానే లెక్కింపబడును

# జాతి చరిత్ర కావ్యం ఆంధ్ర పురాణం

-ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం

తెలుగువారు సగర్వంగా చెప్పుకొనే కావ్య ప్రక్రియ చారిత్రక కావ్యం. తెలుగు చారిత్రిక కావ్యాలలో ఆంధ్రపురాణం అపూర్వ ప్రయోగం. ఆ కావ్య కర్త మధునాపంతుల తన కవితాశైలిలో కావ్యానికి కావ్యేతిహాస గౌరవాన్ని కల్పించి పెట్టారు. ఇటువంటి మూడు ప్రత్యేకతలు త్రివేణీసంగమంలా కలవటం చరిత్రలో ఎప్పుడో కాని సంభవించదు.

కళాప్రపూర్ణ మహాకవి మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారిని స్మరించగానే "ఆంధ్రత్వ మాంధ్ర భాషాచ నాఽల్పస్య తపసః ఫలమ్" అన్న అప్పయ్య దీక్షితులవారి మాటలు జ్ఞాపకం వస్తాయి. పద్దెనిమిదవ ఏటనే (1938లో) పల్లిపాలెంలో "ఆంధ్ర కుటీరాన్ని" స్థాపించిన ఆంధ్రాభిమానం వారిది. తొలి ఖండకావ్యం పేరు "తోరణం". అది ఆంధ్ర భారతీ కుటీరానికి అక్షర తోరణం. మధునాపంతులవారు 1939 నుండి 41 దాకా నడిపిన సాహిత్య మాస పత్రిక "ఆంధ్రి". అందులోనూ ఆంధ్రత్వం పొంగులువారింది. ఆంధ్రికి సంపాదకత్వం నిర్వహిస్తూ నవ్యాంధ్ర సాహిత్య జీవితానికి వారు అపూర్వ దోహదం కలిగించారు. 1940 - 44 సం॥ల నడుమ సూర్యాంధ్ర నిఘంటు నిర్మాణంలో పాల్గొన్నారు. 1950 లో వెలువరించిన వాఙ్మయ వ్యక్తిత్వ చిత్రాలు "ఆంధ్ర రచయితలు". 1954 లో, 1984లో జాతికి అంకితం చేసుకొన్న తమ కావ్య జీవిత సర్వస్వం "ఆంధ్ర పురాణం". ఆ విధంగా ఆయన కలం పట్టినా, గళం విప్పినా, పేరు పెట్టినా, పోరు పెట్టినా 'ఆంధ్రత్వ మాంధ్రభాషాచ' అని అక్షరాలా నిరూపించాడు.

"తోరణ" కావ్యంతో మొదలైన మధునాపంతులవారి రచనా తరంగిణి కడచిన యేడు నవంబర్‌లో వారు కన్నుమూసేంతవరకూ సజీవంగా సాగుతూనే ఉంది. క్రమంగా - షడ్దర్శన సంగ్రహం, రత్న పాంచాలిక, సూర్య సప్తతి, ధన్వంతరి చరిత్ర, రత్నావళి నాటకం, బోధివృక్షం, చరిత్ర ధన్యులు. కళ్యాణతార, స్వప్న వాసవదత్త, శ్రీఖండం, చైత్రరథం, తెలుగులో రామాయణాలు, సాహిత్య వ్యాసాలు, సదాశివ పంచాశిక, కథా పుష్కరిణి మొదలైనవి వారి కలం నుండి వెలువడ్డాయి. వారి రచనలో అనువాదాలకన్నా స్వతంత్ర రచనలకు ఎక్కువ గుర్తింపు వచ్చింది. సాహిత్య వ్యాసాలున్నవి ఎంతో విలువైనవి. అయినా, వాటికంటే 18, 19 శతాబ్దాలలో జన్మించిన సాహితీమూర్తుల వాఙ్మయ రేఖాచిత్రాలుగా ప్రసిద్ధిచెందిన సంపుటి "ఆంధ్ర రచయితలు" తెలుగువారి గుండెల్లో వెలుగు పూలగుత్తిలా మిగిలిపోయింది.

మధునాపంతులవారి పద్యం మధుకోశం లాంటిది. మాధుర్యం దాని గుణం. పూదేనెను పట్టుతేనెలామార్చే రసవిద్య ఆయన కవితకు తేనెటీగకంటె తెలివిగా తెలుసు. పద్యరచనంలోనే కాక పద్యపఠనంలో కూడా ఒక మధురమైన ఫణితిని ప్రదర్శించారు మధునాపంతుల వారు. వారి కావ్యగానం కోసం తెలుగువారు మనసు పడేవారు. ఆంధ్ర పురాణకావ్య గాన సభలు రాష్ట్రమంతటా ముమ్మరంగా సాగిన రోజులున్నాయి. శాస్త్రిగారి కవితాభారతి ఆంధ్రపురాణంలో అవతరించిందని ఆంధ్రావళి మోదమొందినకాలం నేటికీ మరిచిపోలేం. మధునాపంతులవారి సాహిత్యమంతా ఒక యెత్తు; వారి

"ఆంధ్రపురాణం" ఒక్కటే ఒక యెత్తు. జాతి తన స్వీయచరిత్రగా భావించి పరవశిస్తున్న రసజగత్తు !

తెలుగువారు తమ దేశచరిత్రను, జాతిచరిత్రను శిధిలాలలో నుండి పైకి తీసి, ఒక వరుసలో పేర్చుకొని, ఒక సజీవ చిత్రాన్ని రేఖామధురంగా నిర్మించుకొంటున్న రోజులు ఈ శతాబ్ది మొదటి చరణాలు ఆ మధుర సత్యాలకు ముగ్ధులై రాయప్రోలు, విశ్వనాథ, తుమ్మల వంటి కవులు ప్రబోధ కవిత్వాన్ని ఖండకావ్య శంఖారావాలుగా వినదిస్తున్న కాలం. మధునాపంతుల వారు ఆ చైతన్యాన్ని ప్రోగుచేసి, ఆంధ్రజాతిచరిత్రనే మహాకావ్యంగా మలిచే ఒక ఉద్యమంగా సాగించారు. కొండగుర్తుల చరిత్ర నాధారంగా చేసికొని గొప్ప చారిత్రిక కావ్యం నిర్మించారు

"తెలుగున వేల యేండ్లుగ గతించిన గాథల
పెంపు కొంపగు
గుర్తుల పెనుగుంపు గాని 'యిది గూఢిగ
నట్టిది' నాగ దెల్ప నె
వ్వలన నసాధ్య; మైన నొకపాటి
చరిత్రము నేడునేర్పడ
ర్పలం బరిశీలకుల్ తడవి పోవులు
పెట్టిరి పూజ్యబుద్ధులై"

అని అడివిలాంటి చరిత్రలో బాటవేసిన చరిత్రకారులను మధునాపంతులవారు కృతజ్ఞతలతో స్మరించారు. ఆంధ్ర పురాణం తొమ్మిది పర్వాలలో అమర్చిన ఆంధ్రరాజుల అమరచరిత్ర: ఆంధ్ర కవుల అక్షరచరిత్ర కాశ్మీర రాజుల చరిత్ర వ్రాసి కల్హణుడు సంస్కృతంలో కవిగా శాశ్వతంగా నిలిచాడు: అలాగే, ఆంధ్రరాజుల చరిత్ర రచించి మధునాపంతుల తెలుగులో "ఆంధ్ర కల్హణుడు"గా అమరంగా నిలిచిపోయాడు ఉదయ, శాతవాహన, చాళుక్య, కాకతీయ, పునఃప్రతిష్ఠా, విద్యానగర, శ్రీకృష్ణదేవరాయ, విజయ, నాయకరాజ - పర్వాలలో తెలుగురాజుల, కవుల వైభవం, ఆంధ్ర జాతి పౌరుషం ముప్పేటగా సాగి తెలుగువారి ఆదరాభిమానాలను చూరగొంటున్నాయి.

ఆంధ్రేతిహాసంలో మరువలేని మొదటి ఘట్టం హాలచక్రవర్తి కథ ఆంధ్ర పురాణంలో సాహితీ రసికత్వానికి సాక్షిగా సాక్షాత్కరించింది. యథారాజా తథా ప్రజా అన్నట్లు హాలుడు ప్రాకృతాభిమాని అయినప్పుడూ, సంస్కృతాభిమాని అయినప్పుడూ కవుల వర్తనాన్ని కని ఎలా చమత్కరించాడో చూడండి.

"ప్రాకృతగోష్ఠులం బ్రతిరవమ్ముల నిండిన
రాజధానిలో
నేకడ జూడ హాలపృథివీంద్రుడు మెచ్చెడి
దేవభారతీ
శ్రీకవితా ప్రశంస లెరుచింప వచింతురు నేడు-
రాజుతో
లోకము - వాఙ్మయమ్ము - కళలున్ -
మతమున్ - సకల ప్రవృత్తియున్"

## దీనబంధు !

సత్యసాయిరామ సౌజన్యనిధి దేవ
నిత్య శుద్ధ బుద్ధ సత్యమూర్తి !
నూరు ఎనసులందు వూలిన మెడబాపు
దివ్యప్రభల వెల్గు దీనబంధు !

ఎరుక మరపుం నిల యెరిగెడి యెరుకవౌ
వెలుగు చీకటులకు వెలుగువేట
మరపురాని నీవు మాట మంత్రంబౌను
దివ్యప్రభల వెల్గు దీనబంధు !

రాకపోకల నడుమను యేకమగుచు
నిత్య సత్యస్వరూపంబు నెగడువాడ
నిన్ను నెరిగెడి పథమున నన్ను నడుపు
దివ్యప్రభలను వెల్గొందు దీనబంధు !

– గుడిశేవ నరసింహారావు

ప్రౌఢదేవరాయలు ముత్యాలసభలో డిండిమభట్టును వాదులో జయించి, కవిసార్వభౌమ బిరుదంతో పాటు కనకాభిషేకం కూడా గ్రహించిన శ్రీనాథమహాకవి ఆంధ్రుల సాహితీ రసికత్వం సాక్షాత్కరించినట్లుగా ప్రత్యక్షమౌతాడు ఆంధ్రపురాణంలో.

హాలుని గాథ ఆంధ్ర పురాణ కథలకు చక్కని ఒరవడి పెట్టింది. భారతావతరణ ఘట్టం ఆంధ్ర పురాణంలో రసార్ద్రంగా సాగింది చాళుక్యపర్వంలో రాజరాజనరేంద్రుడూ, నన్నయ భట్టూ తెలుగువారి అభిమానప్రతీకల్లా చిత్రింపబడ్డారు.

"గంటము పట్టులో నొక యఖండ భవిష్యము
తోఁచి పల్కు వా
ల్లంటికి నాటపట్టు దొరకం గవితాదయితుండు
భావనా
ఘంటలు ‘ఠంగు ఠంగు’ మనగా జయముం
దెనిగింపఁ బూనె వె
న్నంటి పురాజను సుకృతమైన సరస్వతి
తొందరింపఁగన్"

ఆంధ్ర పురాణ కావ్యగానాల్లో ఈ భావనా ఘంటలు ఠంగుఠంగుమన్న ఘట్టం ఆంధ్రులకు శ్రవణానందాన్ని చూరలిస్తూ ఉండేవి. మధునాపంతులవారు ఇలా ఆర్ద్రంగానూ చెప్పగలరు కావలసివచ్చినప్పుడు ప్రౌఢంగానూ వ్యక్తీకరింపగలరు కాకతీయ పరాక్రమం ప్రౌఢంగా ప్రదర్శితమైంది

‘భరత ఖండంబు జల్లించి పట్టి తేర్చి
పొల్లు తొలగింప మిగిలిన పోటరులను
వాటముగఁ బెంచు కాకతీశ్వరుని పెంపు
[illegible] రాజుల ప్రక్కలో బల్లెమయ్యె ”

‘కస్తూరికా పుండ్రకమ్ము దిద్దిన మేలి
పన చిందులాడు వెన్నొసలివాఁడు
తారహారములు ముత్యాలపేరులు మ్రోల
కొమరారు తెలిజన్నిదములవాఁడు
రత్నాంగుళీయక ప్రభలు శోభలు దీర్చు
విలసిల్లు కెంజేతి వ్రేలివాఁడు
చెలువారు పైడిపువ్వులు కట్టిసంచుల
పట్టుశాలువ వలెవాటువాఁడు
శ్రీనికలవాఁడు, శంభుసేవా వివేక
సాధుశీలమ్ము వాఁడు శ్రీనాథ విభుఁడు
డచ్చమగు తెలునొడువు ముందదులిపఁగ
వెడలె కనకాభిషేకపుం బెండ్లికొడుకు’

తెలుగులో ఏ పండుగకు ముస్తాబైనా పెండ్లికొడుకే. ఆంధ్ర పురాణంలో రాయల వైభవం వ్యంగ్యవైభవాన్ని వెలార్చింది మచ్చుకొక తేటగీతి.

“ చేరి రాంధ్రావనికి సర్వభాగతీయు-
లాంధ్రులెల్లరు కర్ణాట మందు చేరి –
రఖిల కర్ణాట జనులు తిమ్మరుసుఁ జేరి–
రతఁడు శ్రీకృష్ణదేవరాయలను జేరె ”

అడుగడుగునా అనర్ఘ రత్నాలవంటి పద్యాలతో హృద్యంగా సాగే జాతి చరిత్రకావ్యం ఆంధ్రపురాణం. ఆ కావ్యం ఒక కవి జీవితమంత విలువే కాకుండా ఒక జాతి జీవితమంత గౌరవం కలది. అనల్ప సాహిత్య తపః ఫలం. ○

# SRI SAI HARI REAL ESTATES

3/506, Besides Arya Vysya Chowltry

**PUTTAPARTHI - 515 134**

**ANANTHAPUR Dt. ANDHRA PRADESH**

పుట్టపర్తియందు ప్లాట్లు, ఇండ్ల స్థలములు కావలసినవారు, అమ్మదలచినవారు ఈ క్రింది చిరునామా వారిని సంప్రదించండి.

1. సూపర్ స్పెషాలిటీస్ హాస్పిటల్ ఎదురుగా ప్లాట్లు కలవు.
2. గోకులం పోస్టాఫీసు ఎదురుగా ప్లాట్లు కలవు.
3. M. R O ఆఫీసు ఎదురుగా ప్లాట్లు కలవు.
4. బీడుపల్లికి పోవు బస్సు రోడ్డువద్ద ప్లాట్లు కలవు.
5. అపార్టుమెంట్సు కావలసినవారు కూడా సంప్రదించండి.

ప్రొప్రయిటర్

**పి. సిద్దయ్యశెట్టి**

ఆర్యవైశ్య సత్రం ప్రక్కన

పుట్టపర్తి - 515 134

**Phone: 2086**

( 12 వ పేజీ తరువాయి )

ఈ దేహమును మనం కేవలం ఒక పనిముట్టుగా మనం భావించాలి. ఈ పనిముట్టును సరియైన స్థితిలో ఉంచుకోవాలి. భోజనం చేస్తున్నాం మనం. ఎందుకు? దేహరక్షణ కోసమే. కనుకనే వేదము 'భిక్షాన్నం దేహరక్షార్థం' అన్నది. ఇంకా బట్టలు ధరిస్తున్నాం దేనికోసం? అలంకారంకోసం కాదు. 'వస్త్రం శీతనివారణం' మన దేహమంతా రోగములచేతనే కప్పబడి ఉన్నది. దప్పిక ఒక రోగం. నీరు త్రాగటం ఇది ఔషధం. ఆకలి ఒక రోగం. అన్నం తినటమే దీనికి మందు. ప్రతి ఒక్కటీ రోగంగానే రూపొందుతున్నది. రాగమే ఒక రోగము. వాంఛలే ఒక రోగము. ఈయొక్క రాగమును నెరవేర్చుకొనే నిమిత్తమై అనేకవిధములైన పెడమార్గములను పడుతున్నాం. కనుక మొట్టమొదట యీ రాగమనే రోగమును నివారణ చేసుకోవాలి. ఏమిటి యీ రాగం? వాంఛలే యీ రాగము. దీనినే ఆశ... ఆశ... అంటారు. దీనినే తృష్ణ... తృష్ణ అంటారు. ఆశలు రెండు విధములుగా ఉంటున్నాయి. 1. పేరాశ 2. దురాశ. మానవునికి అవసరమైనవి ఆశించటంలో ఏమాత్రం దోషంలేదు. ఉండటానికి ఇల్లు వుండాలి, తినటానికి తిండి వుండాలి, కట్టటానికి బట్ట ఉండాలి. రోగంవ తీసుకోవటానికి మందు ఉండాలి—ఈ విధమైన అవసరాలను తీర్చుకోవటంలో దోషంలేదు. ఈవిధమైన అవసరాల కోసమేకాక ఇంకా మితిమీరిన ఆశలను పెంచుకుంటే 'దురాశ'గా మారుతుంది. ఆ దురాశనే 'రాగము' అన్నారు. కనుక మానవునకు ఆశ ఉండవచ్చును. కాని యీ ఆశలు చీమల పుట్టల వలె పెరుగకూడదు. యీ ఆశల వలన దోచుకొనే రోగము, దాచుకొనే వ్యక్తిత్వం మనలో ప్రవేశించకూడదు. పశు పక్షి మృగాదులుకూడా కాలానుగుణంగా భుజిస్తున్నాయి, నిద్రిస్తున్నాయి, ఆనందిస్తున్నాయి. కాని వాటిలో దాచుకొనే స్వార్థపరత్వం, దోచుకొనే రాక్షసత్వం మాత్రం లేదు.

మానవుడుగా పుట్టి దివ్యత్వంగా తాను ప్రకటింపజేస్తూ, ఈ అత్యల్పమయిన భావములు తనలో ప్రవేశపెట్టుకోవటం చేత మానవత్వాన్ని స్వతఃసిద్ధంగా కోల్పోతూవస్తున్నాడు. ఒక చిన్న ఉదాహరణ. ఒక ఇనుపముక్క ఉన్నది. ఇది చాలా గట్టిగా, కఠినంగా ఉంటుంది. దాన్ని మట్టిలో వేస్తే కొంత కాలానికి Dust (దుమ్ము) పట్టి Rust (తుప్పు) అవుతుంది. ఈ Rust (తుప్పు) పట్టటం చేత ఇనుము శక్తి అంతా Burst అయిపోతుంది. ఈ Burst అయినప్పుడు దానిని అగ్నిలో వేసి Test చేయాలి. ఈ Test చేసినప్పుడు దానిపైనున్న మాలిన్యమంతా పోయి ప్రకాశవంతమయిన ఇనుముగా రూపొందుతుంది. కఠినమయిన ఇనుపముక్క ఎంతో మెత్తదనంగా రూపొందుతుంది. నల్లగా వున్న రూపం ప్రకాశవంతంగా మారుతుంది. కనుక మనం Black ను Black గానే అభివృద్ధిపరచుకోకూడదు. Black ను White గా మార్చుకోవటానికి ప్రయత్నించాలి. కాని ఈనాటి మానవునకు తెలివితేటలు పెరిగిపోవటంచేత, అహంకారం అధికం కావటంచేత, విజ్ఞానం శూన్యమై మరింత అజ్ఞానిగా ప్రవర్తిస్తూ వస్తున్నాడు. ఎట్లా? నల్లగా ఉన్న బొగ్గును తెల్లగా మార్చాలని సంకల్పించుకున్నాడు. కాని ఈ నల్లటి బొగ్గును తెల్లగా మార్చాలని సబ్బుతో రుద్దుతూవచ్చాడు. సబ్బుకూడా నల్లగా మారిపోతూవచ్చింది. ఇది కంపెనీ దోషమేనని భావించి, తెల్లటి పాలను తెచ్చి బొగ్గును కడగగా కడగగా తెల్లటి పాలు కూడా నల్లగా మారిపోయినాయి. ఇది కాదు పద్ధతి. ఇది లౌకికమైన భౌతికమైన పద్ధతులు ఇవన్ని, లోచింతన చేయాలి. ఇది బొగ్గు. బొగ్గు పూర్వం దీని రూపం ఏది? అని విచారణ చేయాలి. ఇది పూర్వం కర్ర. ఈ కర్ర అగ్ని సంస్కారం కావటంచేత కర్రగా కాకుండా, లేక తెల్లగా కాకుండా నల్లగా ( బొగ్గు ) మారిపోయింది. సహజ స్వరూపమూ లేదు. పూర్ణస్వరూపమూ కాదు. మధ్య స్వరూపాన్ని పొంది మాలిన్యంగా ఉంటున్నది. అయితే దీనిని ఏ విధంగా పూర్ణస్వరూపంగా మార్చాలి? అగ్నిలో

వేసి యీ బొగ్గును బాగా కాలిస్తే, పూర్ణంగా కాలిన తరువాత తెల్లగా బూడిదగా మారిపోతుంది. యీ విధానాన్ని చక్కగా మనం గుర్తించాలి. ఇదే అంతర్‌దృష్టి అన్నారు. దీనినే పవిత్రమైన Super mind అన్నారు, యీ Super mind పవిత్రమైన పూర్ణత్వములు పొందేటప్పటికే Over mind గా మారిపోతుంది కర్ర కాదు, బొగ్గు కాదు, శిరస్సున ధరించుకొనే విభూతిగా తయారవుతుంది యీ విభూతి మానవునికి విజ్ఞానాన్ని బోధిస్తుండాలి ఓ మానవా! యీ ప్రపంచం లోపల సమస్త పదార్థములు కూడనూ, కట్టకడపటికి అగ్నిసంస్కారంచేత భస్మం కావల్సిందే! యీ సర్వ పదార్థముల అంతఃస్వరూపము మీమాంస భస్మమే కనుక యీ దేహము కూడను మన నొసటి వ్రాతను బట్టి భస్మమే. ఏదీ శాశ్వతం కాదు. ఒక్కటే శాశ్వతము. అదియే అంతర్వాణి, అదే ఆత్మతత్త్వము, అదే దివ్యత్వము, అదే పవిత్రము, అదియే మానవత్వములో ఉండినటువంటి విశిష్టత.

మానవత్వంలో ఇంతటి విశిష్టమైన దివ్యత్వం ఉండి కూడనూ మనం తెలుసుకోలేకపోతున్నాం. ధన కనక వస్తు వాహనాదులన్నియూ మన కాళ్ళ క్రిందనే ఉంటున్నాయి. కాని మనం ప్రపంచంలో ఎక్కడో వెదుకుతూ పోతున్నాం.

ఇంటిలోన జ్యోతి యెంతయో వెల్గగా
పరుల ఇంటి కగ్గి కరుగనేల
తాను దైవమయ్యు దైవంబు మరచుట
తనను తాను మరచినట్లు కాదె?

తన ఇంటినే కాపల్సినంత అగ్గి వుంటుంటే పరుల ఇంటికి అగ్గికోసం ఎందుకు వెళ్ళాలి? "దేవుడనగ నీ దేహమునందే ఉంటుండగ దేవుడెక్కడనుచు దేవులాడగనేల?" కాదు ... కాదు ... నీలో ఉన్నాడనే సత్యాన్ని నీవు గుర్తించనంతకాలమూ దేవుని బయట ఏమి వెతుకుతావు? కాదు, నీలోనే ఉన్నాడని గుర్తించు. నీ వెక్కడికి పోనక్కరలేదు. అదియే సర్వత్రా వ్యాపించిపోతున్నది సర్వశక్తిని నీకు అందిస్తుంది. నీవు ... అది అనేటటువంటి రెండు భేదములు ఉండవు. తర తమ అనేటటువంటి భేదరహితమైపోతుంది. "ఏకాత్మ సర్వభూతాంతరాత్మ" ఒకే ఆత్మ సర్వ భూతములలో అంతరాత్మగా ఉంటున్నాది.

కనుక మనం మానవులం ... మానవులం ... అని కేవలం ఒక విధమైన అల్పజీవులుగా విశ్వసించరాదు. ఎన్ని జన్మలనుంచి నీ దేహములు మార్పు చెందుతున్నప్పటికీ నీవు వస్తూనే ఉన్నావు. దీనికి అంత్యము లేదు. యీ దేహములు మార్పు చెందుతునే ఉన్నవి గాని ఆత్మ తత్త్వమునకు అంత్యము లేదు. ఒక చిన్న ఉదాహరణ. నీవు సముద్రం దగ్గరకు వెళ్ళు. ఒకదాని తరువాత ఒకటి తరంగములు వస్తూవుంటాయి. అయితే ఆ తరంగములు నీవు ఎంచుకోవటానికి ఎక్కడ ప్రారంభిస్తావో. అక్కడ నుంచే అవి ప్రారంభంగా వుంటాయి ఎప్పుడు నీకు అలసట కలిగి లెక్కించటం విరమించుకుంటావో అప్పుడు అవి అత్యంగా వుంటాయి. కాని సముద్రం వుండినంతవరకు అలలు మాత్రం అత్యం కావు. ఈ విశ్వముండినంతవరకు చైతన్యము అనే దానికి అంత్యమే లేదు కేవలం మానవత్వం అనేటటువంటి ఉపాధిని ఆధారము చేసుకొనినంతవరకు, ఇది ఒక అంత్యంగా కనిపిస్తుంది "మానవ" అనే పదమునకు చక్కగా అర్థమును గుర్తించాలి. "మ" అనగా కాదు. "నవ" అనగా క్రొత్త. క్రొత్తవాడివి కాదు నీవు, పాతవాడివే. నీవు పాతవాడంటే ఏమిటి? పాతది ఆత్మనే. రోతది యీ దేహము రోతదైన దేహమును నీవు విశ్వసిస్తున్నావు గాని, పాతదైన ఆత్మను నీవు విశ్వసించడం లేదు.

జ్ఞానం అనేది ప్రత్యేకంగా వచ్చేటటువంటిది కాదు యీ ప్రత్యేకంగా వచ్చినటువంటి జ్ఞానము కల్పితమైనటువంటి జ్ఞానములే. ఒక ఫిజిక్స్ ఉంటున్నాది. ఒక సూదిని తీసుకొని అగ్నిలో పెడుతే సాగిపోతుంది. ఇది ప్రాకృతమైనటువంటి ఫిజిక్స్. ఒక బాటనీ

ఉంటున్నాది. ఒక వైపు లోపల పేళ్ళను పైకి పెట్టి కొమ్మలను క్రిందకి పెడుతే అది పెరుగుతూవస్తుంది. ఇకి ఒక కెమిస్ట్రిలో చూస్తే పసుపు, సున్నం కలిపితే ఎర్రరంగు వస్తుంది. ఇవన్నీ కల్పితములైనవే. ఇదే కల్పితమైన జ్ఞానము. (Artificial knowledge) Wisdom అనేటటువంటిది Knowledge కాదు. అది అంతర్ముఖమయిన శక్తి. ఇది దివ్యత్వమయినటువంటిది దివ్యత్వమయినటువంటి దానికే ఒక విధమయిన "జ్ఞానము" అన్నారు. యీ కల్పితమయినవన్నీ జ్ఞా యి యీ అజ్ఞానములోనే పడి, అజ్ఞానమునే పెంచుకుంటున్నాము.

"మాయలోనే పుట్టి మాయలోనే పెరిగి
మాయ నెఱుంగరుమందమతులు
బ్రతుకులన్నియు మాయ
భవబంధములు మాయ
సంసారమది మాయ, చావు మాయ
మాయ బ్రతుకటంచు మాయలో పడనేల"

బ్రతుకంత కూడనూ మాయె. మాయయే అజ్ఞానం. మా ... య ... ఉన్నదానిని లేనట్లుగా భావిస్తున్నాడు మానవుడు. మాయకు ప్రత్యేకమయినటువంటి రూపము లేదు. లేనిదానిని ఉన్నట్లుగా, ఉన్నదానిని లేనట్లుగా భ్రమిస్తున్నాము. అంతా మాయ యొక్క ప్రభావమే. తాడును చూచాము కొంచెము చీకటిగా ఉంటున్నాది పాము అని భ్రమిస్తున్నాం. యీ తాడును చూచి పాము అని అనుకొనేవారు వెలుతురులో అనుకోవటానికి వీలు లేదు. చీకటిలో ఉండినప్పుడే తాడును చూచి పాము అని భ్రమిస్తున్నాం. ఇది అజ్ఞానమే. టార్చిలైటు తీసుకొనివచ్చి దానిపైన వేసి ఇది పాము కాదు త్రాడే అనుకున్నాం. టార్చి వేయక మునుపు అది త్రాడే. టార్చి వేసిన తరువాత కూడా అది త్రాడే అజ్ఞానములోను అది ఒక్కటే, జ్ఞానములోనూ అది ఒక్కటే. వచ్చేది పోయేది నీ జ్ఞానమే. అజ్ఞానంలోపల త్రాడు పోలేదు, పాము రాలేదు. రాకపోకలు లేనటువంటి తత్త్వము అదే బ్రహ్మతత్త్వము వచ్చి పోయేటటువంటివన్నీ భ్రమలే భ్రమ ఉన్నంతవరకు మనయందు బ్రహ్మను గుర్తించటానికి వీలుకాదు యీ భ్రమ పోవాలనుకుంటే అమనస్కుడు కావాలి. ఆమనస్కుడు కావాలంటే ఏమి చేయాలి? మనస్సును దైవముతో అర్పితం చేయాలి దైవభావంలో దీనిని ఇమడ్చాలి. ఒక చిన్న ఉదాహరణ. నీవు ఒక కృష్ణ Mould ను చేసిపెట్టుకున్నావు. కరిగించి వెండిని పోత పోసావు కాని యీ విగ్రహములో నగలూ వెండే, కాళ్లు వెండే, కళ్ళు వెండే - సర్వాంగములూ వెండితో సుందరమై పోయినది దీనినే "బ్రహ్మవిత్ బ్రహ్మైవభవతి" అన్నారు. మనస్సును దైవంతో అర్పితం చేసినప్పుడు మనస్సనేదేలేదు సర్వమూ దైవమే. ఈ మనస్సంతా కూడనూ దైవస్వరూపాన్నే పొందుతుంది. కాని మనస్సును ఈనాడు మనం ప్రాకృతంపై అమర్చుతున్నాం. ప్రకృతి అనే దానిపై Mould వేస్తున్నాం. ప్రకృతి చింతన చేస్తున్నాం. కనుక ఇప్పుడు మనస్సంతా కూడనూ ప్రకృతిమయంగా ఉంటున్నాది. దీనిని పురస్కరించుకొనియే 'మనోమూలం ఇదం జగత్' అన్నారు. జగత్తంతా మనస్సు స్వరూపం అయిపోయింది "విశ్వం విష్ణు స్వరూపం" కాని కేవలం ప్రాకృతమైన స్వరూపం కాదు. కార్యకారణ సంబంధమే విశ్వము. ఆ సత్యాన్ని మనం గుర్తించాలి. కాని ఆ సత్యాన్ని మనం గుర్తించటం లేదు. అల్పత్వాన్ని ఆశించి, అధికత్వాన్ని విస్మరించి, కేవలం మానవత్వాన్ని కోల్పోతున్నాం.

"మానవుడు" అనేది ఎంత విచిత్రమైనటువంటి పేరు, ఎంత విలువైన పేరు. మానవుడు...మానవుడు అని హీనంగా భావిస్తున్నాం. కాని ఆ మానవులయందు కూడనూ అల్పత్వంగా వుండినటువంటివాడు కూడనూ అధికత్వంగా ఉండే పేరును ఉచ్చరిస్తుంటాడు. ఒక చిన్న ఉదాహరణ. మన యింటికి ఒక బిచ్చగాడు

వచ్చాడు "అమ్మా ! అనాథిని ! కాస్తంత అన్నం పెట్టండి! " అంటాడు. అనాధి అంటే ఏమిటి ? ఆద్యంతములు లేనటువంటివాడు. బిచ్చగాడు కాదు అనాది అనగా దైవమే. ఒక్కొక్క పదములో ఎంతో పవిత్రమైన అర్ధం కనిపిస్తుంది కాని దానిని మనం అల్పత్వంగా భావిస్తుంటాం. అనాధిని అంటే ఎవరూ ఆధారం లేనివాడని భావిస్తుంటాం. పదములకు నానార్ధములు ఉంటుంటాయి. నానార్థములలో యదార్థం ఉంటుంది. యదార్థాన్ని విస్మరించి అనర్థాన్ని తీసుకుంటున్నాం మనం. కనుక ప్రతి విషయమునందును ఎంతో గాఢమైన అంతరార్థం ఉంటున్నది.

ఒకానొక సమయంలో త్యాగరాజు సర్వమూ త్యాగం చేసి, రాముడే నా ప్రాణమని భావించి " నిధి చాలా సుఖమా ! రాముని సన్నిధి సుఖమా ! " అని వచ్చిన నిధిని తన్నిపారేశాడు "హరి కావాలి కాని సిరి నా కవసరం లేదు " అన్నాడు. కనుక హరిని ఆశించటంచేతనే సర్వమూ సిద్ధించింది కబీరు చాలా బీదవాడు. బట్టలునేసి బ్రతికేటటువంటివాడు. ఇంటికి వచ్చినవారందరికీ. తనకున్నదానిలో ఏదో ఒకటి పెట్టేవాడు. ఎల్లప్పుడూ ఆనందంగా ఉండేటటువంటివాడు. ఒకనాడు రాజు ఆ బికారికి, ఆ అనాథకి ధన కనక వస్తువాహనాదులు పంపించాడు కబీరు స్నానం చేసి అప్పుడేవచ్చి వాటిని చూచి 'ఎవరయ్యా! వీటిని పంపించాడు' అని అడిగాడు. మహారాజు పంపించారని భటులుచెప్పారు. 'ఎవ్వరికివ్వమనిపంపించాడు?' అని అడిగాడు కబీరు. " కబీరు అనాధుడు ! అతనికి యివ్వండి! " అని చెప్పి పంపించాడని వారు చెప్పారు. "ఓ ! ఓ ! అనాధుడికివ్వమని చెప్పాడా ! మీ రాజు. నేను అనాధుడను కాదు. నాకు నాధుడున్నారు. నాకు నాధుడు శ్రీరామచంద్రుడే ! కనుక నాకు నాధుడున్నాడు కాబట్టి నేను అనాధుడను కాదు. రాముడికి మరో నాధుడు లేడు. అతనే అనాధుడు కనుక అతనికి అర్పితం చేయండి! " అన్నాడు. అనాధుడు ఎవరంటే భగవంతుడే.

అయితే ఈ పదమునకు సరియైన అర్థం తెలుసుకోలేక అనాధుడంటే దిక్కులేనివాడని మనం భావిస్తున్నాం. అందుకోసమనే భగవంతుని అనాధనాధ ! అన్నారు. ఈ విధంగా ప్రతి పదమునకు చక్కగా అర్థమును గుర్తించే ప్రయత్నం చేయాలి.

దివ్యాత్మస్వరూపులారా !

మీరు ఆత్మగానే విశ్వసించండి. కేవలం కాయధారులుగా మీరు విశ్వసించకండి దేహము, మనస్సు, బుద్ధి, చిత్తము, ఇంద్రియము, అంతఃకరణ - ఇవన్నియూ, ఉపాధులు. ఇవన్నీ మనం ధరించే డ్రస్సులు. ఈ డ్రస్సులు కూడానూ ఒకానొక సమయంలో పోతుంటాయి. దీనినే జీసస్ కూడనూ "Dress is a dress of life" అన్నారు. మనం మరణం అనుకుంటున్నాం. మరణం అంటే Dress (బట్టలు) విప్పటమే క్రొత్త బట్టలు వేసుకోవటమే మనం బట్టలు విప్పి చాకలివానికి వేస్తుంటే ఏడుస్తున్నామా ! లేదు :.. లేదు. ఈ ఏడ్వటం దేనికోసం? ఎంతోకాలం దీనితో అభిమానం పెట్టుకొని, సంబంధ బాంధవ్యములతో అనుభవించడం చేత ఏడుస్తున్నాం. కనుక ఈ సంబంధ బాంధవ్యములనే టటువంటివి తాత్కాలికమైనవేనని మనం భావిస్తుంటే, ఏమాత్రం దుఃఖముండదు సుఖదుఃఖములంత కూడనూ మన అనుబంధములే మూలకారణం. Attachment దేనికి ఉండాలి ? దేవునితో సంబంధం ఉండాలి అది ఏనాడూ మార్పు చెందనటువంటిది. అదే నిత్యసత్యమైనటువంటిది. కనుకనే మనం దైవస్వరూపులుగా మనం విశ్వసించాలి. " అహం బ్రహ్మాస్మి " "తత్ త్వం అసి." "ప్రజ్ఞానం బ్రహ్మ" "అయమాత్మా బ్రహ్మ" I am atma, I am brahma-ఆవిధమైన భావాలను మనం అభివృద్ధిపరచుకోవాలి.

I am man, I am ramayya I am raishnaiah అటువంటి తుచ్ఛమైన దేహభ్రాంతులతో మనం పోకూడదు. ఈ దేహమును ఎవరు కన్నారు ? తల్లి

దండ్రులు. దీనికి ఎవరు పేరుపెట్టారు? తల్లిదండ్రులు పేరు పెట్టినారు. పేరు పెట్టినదే కాని పుట్టినది కాదు. పుట్టనిది పెట్టనిది ఇందులో ఒకటి ఉంటుండాలి అదియే ఆత్మ దీనికోసమనే మూడు విధములైన మార్గములను బోధిస్తూవచ్చింది. ఉపనిషత్తులు 1. వస్తే పోదు. 2. పోతే రాదు. 3. పోదు రాదు. 1. వస్తే పోదు అనే జ్ఞానము. ఒక్కసారి వచ్చిందా తిరిగిపోదు. వచ్చి పోయేటటువంటిది జ్ఞానం కాదు 2 పోతే రాదు. **ఏమిటది? అజ్ఞానం.** ఒక తూరి పోతే అజ్ఞానం తిరిగి రాదు. పోతూ వస్తూ వుంటే చావటం, పుట్టటంలాగే ఉంటుంది. ఇది రెండు విధములైనటువంటిదికాదు, పోతే రాదు. 3. ఇక మూడవది ప్రధానమైనటువంటిది రాదు పోదు. అదే ఆత్మతత్త్వము. దీనికి ఒక చిన్న ఉదాహరణ చెప్పాను కొడైకెనాల్‌లో ఒక దేహముండాది. ఈ దేహము మరణించిన తరువాత దీని ఆత్మ ఎక్కడికి పోతుంది? ఏ విధంగా ప్రయాణం చేస్తుంది? అని అనేకమంది అనుమానాలు వెలిబుస్తుంటారు, దేహము మరణించిన తరువాత ఈ ఆత్మ ఎక్కడికి పోతుంది? ఎంతకాలం సంచారం చేస్తుంది? ఎక్కడ తిరిగి ప్రవేశిస్తుంది? ఇవన్నీ హాస్యాస్పదమైన ప్రశ్నలుగా ఉంటుంటాయి. కరెంటువైర్లు ఉంటున్నాయి. అక్కడ బల్బు పెట్టేటప్పటికి లైటు వచ్చేస్తుంది. బల్బు తీసేటప్పటికీ వెలుతురు పోతుంది బల్బు వచ్చింది, పోయింది. బల్బు రాకమునుపు కరెంటు అక్కడనే ఉన్నది బల్బు పెట్టినప్పుడూ కరెంటు అక్కడనే ఉంటున్నది. బల్బు పోయినతరువాతకూడా కరెంటు అక్కడనే ఉంటున్నది రాలేదు పోలేదు. కరెంటు అక్కడనే ఉంటున్నది ఆదేవిధముగ దేహము వచ్చింది పోయింది ఆత్మ ఏక్కడికీ పోలేదు రాలేదు. అక్కడనే ఉంటున్నాది. పోయేందుకు స్థలముంటే గదా! నేను బయటకు వెళ్ళాలనుకుంటే బయట అనే ప్రదేశము ఒకటి ఉంటే కదా! బయట అనేటటువంటిదే లేదు. ఒకానొక సమయంలో రాధ కూడా చెప్పింది.

వేయఃబోవని తలుపు
తీయనంటిని పిలుపు
రాధకెందుకో సలుగెలుపు
సీలోన నాలోన
నిండి ?లిగే పలుపు
మేలుకుంటే లేదు పిలుపు
విశ్వమంతా ప్రాణవిభుని మందిరమైన
వీధి వాకిలి లేదెకో
విశ్వవిభుడ నా వెనువెంటనే వుండ
పిలుపేది తలుపేది వీధివాకిలి ఏది
వీణతంత్రులు మీటె ప్రాణతంత్రులు నాటి
ఆనందభాష్పములు; ఆత్మార్పణము చేయ
వీధివాకిలి అదియరా, కైలాసమే చూడరా!
ఓ జీవా!
వీధివాకిలి అదియరా!

కైలాసము! వైకుంఠము! కుంఠితము కానటువంటిది వైకుంఠం ఆనందముతో వుండినటువంటిదే కైలాసము. కైలాసము అనే పట్టణం వేరొకటి లేదు. వైకుంఠం అనేటటువంటి పట్టణం మరొకటి లేదు. భగవంతుడా! నీ Head office ఎక్కడ? అని భగవంతుని నారదుడు ప్రశ్నించగా "మద్భక్తాః యత్రగాయన్తి తత్ర తిష్ఠామి నారదా! ఎక్కడ నా భక్తులు హృదయంతో గానం చేస్తుంటారో అక్కడే నా ప్రతిష్ఠ అయివుంటాది. కైలాస! వైకుంఠములు నా Branch Office లు. పర్మినెంట్ అడ్రసు ఒక్కటే - అదియే హృదయస్థానము కనుక భగవంతుడు హృదయములో ఉంటున్నాడు "హే ద్వారకావాసా! హే బృందావనసంచారి! హే మధురాపురవిహారి!" ఈ విధంగా అనేకవిధముల ప్రార్థించింది ద్రౌపది. కృష్ణుడు రాలేదు. అలసిపోయి చిట్టచివరికి హే హృదయవాసి! అన్నది. అప్పుడు వచ్చాడు

కొంతకాలం అయినతరువాత కృష్ణునిఅడిగింది ద్రౌపది. "ఓ సోదరా! ఆనాడు నాకు అంత పరాభవం జరిగితే ఎన్ని పర్యాయములు పిలిచినా ఎందుకు రాలేదు?" అని అడిగింది. అవునమ్మా! రాలేదు కారణం చెప్పమంటావా? హే ద్వారకావాసి! అని పిలిచావు నీ ప్రక్కనే వున్నటువంటివాడను కూడను నీ మాటలోని సత్యాన్ని నిలబెట్టుకోవటానికోసం, నేను ద్వారకకు పోయిరావాలి. హే బృందావనసంచారీ! అని అన్నావు. నేను బృందావనం వెళ్ళిరావాలి. నీ మాటకు సత్యమును చేకూర్చే నిమిత్తమై, అక్కడికి వెళ్ళిరావటంలో ఆలస్యమైపోతుంది గదా! ఓ హృదయవాసీ! అన్నావు. అప్పుడు తక్షణమే వచ్చాను, కనుక భక్తులయొక్క వాక్యాలు పరిపాలన చేసే నిమిత్తమై భగవంతుడు కూడనూ అనేకరకముల మార్పులు చేయవలసివస్తుంది. "సత్యం కంఠస్థ భూషణం" సత్యము కంఠమునకు భూషణం. కనుక నిన్ను సత్యస్వరూపుణిగా చేసే నిమిత్తమై నేనీవిధమైన అవస్థలు పడవలసివచ్చింది. కనుక భగవంతుడు హృదయవాసి ఎక్కడపడితే అక్కడ వుంటాడు, కాని ఇంత సమీపంలో మరొక చోట మనకు చిక్కడు.

"తల్లికంటె మిన్న దైవంబె దగ్గర' తల్లి అయినా కొంతకాలం దూరంగా ఉండవచ్చును. దైవము దూరంగా ఉండడు. దూరమనేదే లేదు. అనగా తానే దైవము. ఇలాంటి సత్యాన్ని మనం చక్కగా గుర్తించుకుంటూ రావాలి. అప్పుడే మన మానవతత్వమనేది కూడనూ, చాలా విశాలమైనటువంటి దైవత్వంగా రూపొందుతుంది ఈ దుఃఖములకు, విచారములకు, కష్టములకు, నిందలకు, విష్ఠూరములకు మనం ఏమాత్రం లెక్కచేయనవసరం లేదు. చైతన్యుని అనేకమంది దూషిస్తూవచ్చారు. దూషించినకొద్దీ ఆనందంతో నాట్యం ఆడుతూవచ్చాడు. ఎందుకు చైతన్యా ఇంత ఆనందిస్తున్నావు? దూషణలు నీకు బాధలు కలిగించడంలేదా? అని అడిగారు "అయ్యా! ఆ దూషణలు నాకు కాదు గట్టిగా దూషిస్తే గాలిలో తేలిపోతాయి తనలో తాను దూషించుకుంటే తనకే తగిలిపోతాయి నా వరకు అవి ప్రయాణం చేయటం లేదు కాబట్టి నేను ఆనందిస్తున్నా నన్నాడు చైతన్యుడు. కనుక లోకులు కాకులు

గోపికలను అడిగాడు ఉద్ధవుడు "అమ్మా! లోకమంతా మిమ్ములను విమర్శిస్తూఉన్నది అత్తమామల ఆజ్ఞలను ఉల్లంఘించి, భర్తను ధిక్కరించి మీరు కృష్ణా! కృష్ణా? అని పరుగెత్తుతున్నారు - రాత్రింబవళ్ళు ఆ సమయమే లేకుండాపోతున్నది. కనుక అందరూ మిమ్ము నిందిస్తున్నారన్నాడు ఉద్ధవుడు. "ఓ ఉద్ధవా! కాకులు అరుస్తున్నాయని కోకిల తన గానమును తాను మానుకుంటుందా? లోకులే కాకులు. కనుక ఈ కాకులు కూతలకు మేము కోకిలలాగే వుంటున్నవారం, మేము భగవచ్చింతన చేస్తున్నాం. దీనికి మేము ఏమాత్రం వెరువనవసరం లేదు. కేవలం హంసను చూచి కొంగలు పరిహసించినంతమాత్రాన హంసలకు కలిగే లోపం ఏమిటి? ఏనుగును చూచి కుక్కలు మొరుగుతాయి. ఏనుగుకు ఏమైనా వీటినేమైనా లెక్కచేస్తుందా? లేదు కనుక మేము దైవాన్ని కోరుతున్నామే గాని లోకాన్ని కోరటంలేదు. లోకాన్ని కోరినప్పుడు మేము భయపడాలి. దైవాన్ని కోరినప్పుడు మాకు భయమెందుకు? కాన అభయస్వరూపుడైన దైవాన్ని మేము ఆశిస్తున్నాం" అన్నారు. ఆనాటి జ్ఞానం ఇలాంటి పవిత్రమైన రూపముగా రూపొందింది అది. అలాంటిదానికి ఈనాడు మనం తిరిగి పునాది వేయాలి విద్యార్థులు, యువకులు ఈ పవిత్రమైన జ్ఞానాన్ని కొంతవరకు

సంపాదించుకోవాలి దేనికీ మనం వెరువరాదు అనేక మంది అనేక రకములుగా భావించవచ్చును తలలు వేరైనప్పుడు తలంపులు వేరుకావచ్చు మనం ఎందుకు వెరచాలి ? మనం వెరచకూడదు.

భయపడి దేవుని భజనసేయగ లేక
భ్రమచెంది మరణించు సమయమువందున
బలమి మీరగ ఎవడు రండిక రమ్మంచు
వారిందరప్పుడు
అయ్యోయ్యోయనియె ఏడ్పింప నెవరు
అడ్డగింపగనెత్తురప్పు

**పరమేశ్వరుడు ఇట్లు ...**

తరుణి ఎప్పుడు చూడ పర పీడించుచుండనుగ
ఏ విధముగ చూడ తరుణి జన్మమె ఘనముగ
ఆ ధారణ వర్ణింప వలెనుగ
నవమాసములు మోసి కనిపెంచి ఘనబుద్ధులను నేర్పి
తనయుని యొసగెడి తల్లి తక్కువ యగునా ?
............వెనుక నుంచిరి తండ్రి పేరును
కనర ఈ విధముగ అన్నిటికి తరుణి నామంబె ముందు

ఆ తరుణియే ఈ ప్రకృతి. ఈ ప్రకృతియే ధర. ఈ ధరయొక్క మార్పే ఈ రాధ పర ... రాధ ప్రకృతి పరమాత్మలు బింబ ప్రతిబింబములే కనుకనే లోకములో సీత రామ, పార్వతి పరమేశ్వర, లక్ష్మి నారాయణ అని పేర్లు పెట్టుకోవటంలోని అంతరార్థమేమిటి ? మొట్టమొదట ప్రకృతి తరువాత పరమాత్మ ప్రకృతిని పరమాత్మగా విశ్వసించు ఈ రెండూ ఏకమై పోతాయి కనుక ఈ అంతరార్థమును ప్రబోధించే నిమిత్తమై వేదాంతం ఇన్ని విధములైన మార్గాలను ప్రబోధిస్తూవచ్చింది.

# శ్రీసాయివాణి

వివేకంలేని విజ్ఞానం
విచక్షణలేని పాండిత్యం
విజ్ఞతలేని స్నేహం
వినయములేని విద్య
శీలములేని మనిషి
నీతిలేని వాణిజ్యం
న్యాయంలేని చట్టం
భక్తిలేని పూజలు
దేశభక్తిలేని రాజకీయాలు
ఐకమత్యంలేని సంఘం
ఉన్నా ... ప్రయోజనంలేదు
ప్రమాదం కూడాను - బాబా

## దివ్యాత్మస్వరూపులారా

మొట్టమొదట మనం ఈ అల్ప భావాలను దూరం చేసుకోవాలి. దుఃఖవిచారములకు ఏమాత్రం అవకాశం యివ్వకూడదు. ఇవన్నీ కదిలిపోయే మేఘములే. ఏ ఒక్కటీ శాశ్వతమైనది కాదు. కనుక శాశ్వతమైనది ఒక్కటే అదియే భగవతత్త్వము అదియే నిజమైన సత్యతో కూడినటువంటి మార్గము.

(ది 20-5-93 సాయంత్రం బృందావన్‌లో జరిగిన వేసవితరగతులలో భగవాన్ బాబావారు చేసిన దివ్య ప్రసంగంనుండి)

# విద్యాలయాలలో నైతిక బోధనకు పుస్తకాలు

ఈనాడు పాఠశాలల్లో విద్యాబోధన యాంత్రికంగా జరుగుచున్నది. విద్యార్థులను ఉత్తమపౌరులుగా, దేశభక్తులుగా, కార్యశీలురుగా రూపొందించే అంశములందు కానరావటం లేదు. ఈ లోటు తీర్చి సౌశీల్య నిర్మాణానికి దోహదం కలిగించే భావ పరంపరను విద్యార్థులకు అందజేయడానికై **ఈ క్రింది పుస్తకాలను ప్రచురించాము.**

శ్రీరామకృష్ణ విద్యాలయం, పాల్వంచ, ఉషోదయ పబ్లిక్ స్కూలు, గుడివాడ, రాజధాని రెసిడెన్షియల్ స్కూలు, కుకట్‌పల్లి, శ్రీసత్యవాణి విద్యానికేతన్, జీడిమెట్ల, శ్రీరామా రూరల్ కాలేజి, చిలుమూరు మున్నగు విద్యాసంస్థలలో 4 నుండి 10 తరగతుల వరకు వీటిని నైతిక బోధనకు పాఠ్యగ్రంథాలుగా నిర్ణయించి బోధించుచున్నారు. మీమీ విద్యాలయాలలో వీటిని ప్రవేశపెట్టి వినియోగించవలసినదిగా పాఠశాలల నిర్వాహకులకు విజ్ఞప్తి చేస్తున్నాము.

| | | | |
|---|---|---|---|
| 1. సూక్తిసుధ | (53 సూక్తులు, వివరణ) | 4వ తరగతి | రు. 6-00 |
| 2. చదువుకుంటే బహుమతి | (23 నీతి కథలు) | 5వ తరగతి | రు. 6-00 |
| 3. పనికొచ్చే కథలు-1 | (35 చిన్న కథలు) | 6వ తరగతి | రు. 10-00 |
| 4. పనికొచ్చే కథలు-2 | (35 చిన్న కథలు) | 7వ తరగతి | రు. 10-00 |
| 5. కాంతి రేఖలు -1 | (ప్రబోధాత్మక రచనల సంపుటి) | 8వ తరగతి | రు. 12-00 |
| 6. కాంతి రేఖలు -2 | (ప్రబోధాత్మక రచనల సంపుటి) | 9వ తరగతి | రు 12-00 |
| 7. కాంతి రేఖలు -3 | (ప్రబోధాత్మక రచనల సంపుటి) | 10వ తరగతి | రు. 12-00 |
| 8. ఎలా చదవాలి? | (పరీక్షలకు చదివే పద్ధతి) | అన్ని తరగతులకు | రు. 5-00 |

రచన : శ్రీ మన్నవ గిరిధరరావు, ఎం. ఏ., Ex. M L C

ప్రచురణ :

## యువభారతి ఎడ్యుకేషనల్ సొసైటీ

కృష్ణనగర్, గుంటూరు – 522 006

( 3 వ పేజీ తరువాయి )

భిక్ష పెట్టారు భగవాన్ బాబా. ఈ వాస్తవాన్ని ఎవరూ కాదనలేరు.

ఈ దుర్ఘటనను ఆసరాగా తీసుకొని కొంతమంది స్వార్థపరులు విమర్శలు చేస్తున్నారు కొన్ని పత్రికలు ఊహాతికల్పనలు వ్రాసి ప్రజలను పెడమార్గాన పట్టిస్తున్నారు యీ దుర్ఘటన జరుగుతుంటే, దానిని నివారించలేక బాబా పారిపోయినాడని విమర్శించినవారూ ఉన్నారు, దివ్యశక్తిని గురించి ఏమాత్రం అవగాహన లేనివారు చేసే విమర్శనలు ఇవి నాస్తికులు చేసే విమర్శనలు ఇవి. పురాణ ఇతిహాసములు చదవనివారు చేసే విమర్శనలు ఇవి సనాతన ధర్మమంటే ఏమాత్రం అవగాహన లేనివారు చేసే విమర్శనలు ఇవి దురుద్దేశ్యంతో చేసే విమర్శనలు ఇవి. ఒకమాటు పురాణములను పరికిస్తే ఒక సత్యం బోధపడుతుంది. ఒక వాస్తవం తెలుస్తుంది. భగవంతుడైనా, అవతారపురుషుడైనా, పురాణపురుషుడైనా శాశ్వతమైన ధర్మసంస్థాపనను దృష్టిలో పెట్టుకొని ఒక్కొక్క సమయంలో మానవునిలా ప్రవర్తించవలసి వస్తుందనే నగ్న సత్యం ఒకటి బోధపడుతుంది శనీశ్వరుని బారినుండి తప్పించుకోవటానికోసం సాక్షాత్ సర్వేశ్వరుడే కైలాసమును, సతీదేవిని వదిలి చెట్టు తొర్రలో దాగలేదా ? రాక్షసుల బారినుండి తప్పించుకోవటానికోసం, ఇంద్రపదవిని, శచీదేవిని వదిలి కమలనాళంలో వెయ్యి సంవత్సరాలు దాగలేదా ? జరాసంధుడు దండెత్తివస్తే మధురాపురిని వదిలి సముద్రగర్భంలో ద్వారకానగరిని నిర్మించుకొని సకుటుంబ సపరివారంగా అక్కడికి వెళ్ళలేదా ? ఇక్కడ భగవాన్ బాబావారు ఎక్కడికీ పారిపోలేదు శత్రువులను ఎదిరించడం చేతకాక వారు ఈ పనులు చేయలేదు ఎవరు ఎవరి చేతిలో సంహరించబడాలో ఎప్పుడో నిర్దేశించబడింది. (జరాసంధుడు భీముని చేతిలో సంహరించబడాలి) శ్రీకృష్ణుడు భారతయుద్ధంలో తన సుదర్శన చక్రంచేత శత్రువులను సంహరించలేక కాదు ఆ పని చేయవలసినది అర్జునుడు కాబట్టి, అతనికే వదిలేశాడు ఎవరు ఎప్పుడు ఏ పని చేయాలో ఎప్పుడో నిర్దేశించబడింది. దానికి విరుద్ధంగా చేయరాదు శాశ్వతమైన ధర్మసంరక్షణే వారి పరమావధి

కలియుగానికి వస్తే ఏసుక్రీస్తు తనను శిలువ వేస్తుంటే మౌనంతో బాధను సహించారేగాని నిరాకరించాడా ? సోక్రటీస్‌కు విషం యిస్తే ఆనందంతో స్వీకరించాడేగాని ఎదురు తిరిగాడా ? ఆదిశంకరులను బలి యివ్వటానికి తీసుకొనిపెళుతుంటే, తుచ్ఛమైన, భౌతిక శరీరమును రక్షించుకోవటాని కోసం తన దివ్యశక్తిని వినియోగించాడా ? వీరందరిని ఈనాడు సమాజం ఆరాధించడం లేదా ? దివ్యశక్తిమీద ఏ మాత్రం విశ్వాసం ఉన్నా ఈ కువిమర్శనలు చేయరు.

ఈ మధ్య మరో వ్యక్తి మరొక విమర్శన చేసాడు. బాబా దివ్యశక్తి సంపన్నుడంటున్నారు గదా ! భూత భవిష్యత్తు, వర్తమానములు తెలుసునంటున్నారు గదా! రానున్న అపదను ముందుగా ఎందుకు పసిగట్టలేదు ? పసిగట్టి ఎందుకు నివారించలేదు? బాబాగారు ఆత్మీయుడైన తన కారు డ్రయివరునే బ్రతికించుకోలేకపోయినాదేమిటి? అనే ప్రశ్నలు వేశాడు. అయితే వాస్తవమును తెల్సుకోవటాని కోసం వేసిన ప్రశ్నలే ఇవి కాని, పురాణాలు తెలియనివారు వేసే ప్రశ్నలు అలనాడు బంగారు లేడి రూపంలో వచ్చినవాడు మారీచుడని తెలియక శ్రీరామచంద్రుడు దానిని వెంబడించాడా ? రావణుడు వచ్చి సీతను అపహరించుకొని వెళ్లతాడని శ్రీరామునికి తెలియదా ? ఆయన మానవరూపంలో అవతరించాడు కాబట్టి మానవునిగానే ప్రవర్తించాడు రావణుడు సీతను అపహరించుకొనిపోకపోతే రామరావణ యుద్ధం జరిగి ఉండేదే కాదు. లోకకంటకుడైన రావణుడు సంహరించబడి ఉండేవాడే కాడు. అలనాడు భారతయుద్ధం జరుగుతుందని శ్రీకృష్ణునికి తెలియదా ? 18 అక్షౌణీల సైన్యం మరణిస్తారని తెలియదా ? అన్నీ తెలుసు అన్నీ తెలిసే ధర్మరక్షణకోసం

అంగీకరించాడు పద్మవ్యూహంలో అభిమన్యుడు మరణిస్తాడని శ్రీకృష్ణునికి తెలియదా? ఉప పాండవులను అశ్వత్థామ చంపుతాడని తెలియదా? అన్నీ తెలుసు. ఆ విధంగా జరగాలి కాబట్టి జరిపించాడు. అవతార పురుషుల ధ్యేయం శాశ్వతమైన ధర్మరక్షణేగాని, సంకుచితమైన స్వార్థదృష్టి వారికి ఉండదు. అంతిమ లక్ష్య సాధనతో తరతమ బేధాలను పాటించరు. భగవాన్ బాబావారు ఈ దుర్ఘటనను ముందుగా పసిగట్టారు కాబట్టే, బెంగుళూరు నుండి ముందుగానే ప్రశాంతి నిలయం చేరుకున్నారు. బాంబులకు ప్రశాంతి నిలయం విధ్వంసం కాకుండా కాపాడగలిగారు. ఎంతోమంది భక్తులను రక్షించగలిగారు. దీనిని నమ్మినా నమ్మక పోయినా ఇది మాత్రం వాస్తవం.

ఈ దుర్ఘటన జరిగిన తరువాత అనేక విషయాలు వెలుగులోనికి వచ్చాయి. వాటిల్లో ఎక్కువభాగం అభూత కల్పనలే అయినప్పటికీ కొన్ని వాస్తవాలు కూడా లేక పోలేదు. ఒక చెడు కూడా ఒక మంచికే జరుగుతుంది. అది ఎప్పుడు జరుగుతుంది? ఆత్మవిమర్శన చేసుకొని నప్పుడు ఎవరి తప్పు వారికి తెలుస్తుంది. కొన్ని తప్పు లను మనకు తెలియకుండానే చేస్తుంటాం. వాటి నుంచి బయటపడటానికోసం మరికొన్ని తప్పులు చేస్తుంటాడు మానవుడు. ఒక్కొక్క సమయంలో వాటి నుండి బయట పడలేక ఆ విషవలయంలో చిక్కుకొనిపోతాడు. తన తప్పును తాను తెలుసుకొని, పశ్చాత్తాపపడి తిరిగి ఆ తప్పును చేయకుండా వుండటమే విజ్ఞత లక్షణం. తప్పు చిన్నదా? లేక పెద్దదా? అని కాదు. తప్పు తప్పే. దానిని సకాలంలో సరిదిద్దుకొనలేకపోతే అదే బ్రహ్మ రాక్షసిగా మారి అందరినీ మ్రింగుతుంది. ముఖ్యంగా ఈ విషవలయాలను దృష్టిలో పెట్టుకొని, ఇటువంటి బృహత్తర సంస్థను నడుపుతున్న నిర్వాహకులు కడు జాగరూకతతో వ్యవహరించాలి.

భగవాన్ బాబావారిమీద ప్రేమతో, వారిదివ్య శక్తి మీద వుండిన అచంచలమైన భక్తి విశ్వాసముతో, నమ్మకంతో ఎంతోమంది భక్తులు ప్రపంచం నలు మూలల నుండి ప్రశాంతినిలయం వచ్చి పోతుంటారు. వారిని నిర్వాహకులు ప్రేమతో పలుకరించాలి. ఆప్యాయ తతో ఆదరించాలి. అప్పుడప్పుడు కార్య భారం వలన భక్తులతో కటువుగా మాట్లాడుతున్నట్లు వార్తలు వస్తు న్నాయి. దీని వెనక దురుద్దేశ్యం ఉన్నదని ఎవరూ అనలేరు. కాని భక్తులు మాత్రం అనేక సందర్భాలలో మనస్తాపానికి గురిఅవుతున్నారు. బాబా సమక్షంలోనే వుండేవారి ప్రవర్తన యీ విధంగా వున్నదేమిటని బాధ పడుతున్నారు. బాబా దర్శనం బాగా జరిగిందిగదాయనే భావంతో యీ చిన్న విషయాలను కొంతమంది పట్టించు కోవటం లేదు, మరికొంతమంది జరిగిన తప్పులకే ప్రాధాన్యతనిచ్చి ద్వేషం పెంచుకుంటున్నారు. ఇది వారి వారి మనస్తత్వాల మీద ఆధారపడివుంటుంది. అసలు ఇటువంటి వాటికి ఆస్కారమే యివ్వకుండా నిర్వాహకులు జాగ్రత్తపడాలి.

భగవాన్ బాబావారి సమక్షంలో వుండే మహాద్భాగ్యం అందరికీ లభించదు. అది వాళ్ళ పూర్వజన్మ సుకృతం మీద ఆధారపడివుంటుంది. ఆశిస్తే వచ్చేదికాదు. అర్హత ఉంటేనే లభిస్తుంది. కనుక వచ్చిన అవకాశమును సద్వినియోగపరచుకోవడం విజ్ఞుల లక్షణం. అసలు భగవాన్ దివ్యబోధనలను అర్థం చేసుకొని, ఆచరణలో పెట్టితే, ఇటువంటి అవాంఛనీయమైన సంఘటనలు అసలు జరుగనే జరుగవు. బాబా ఒక పర్యాయం చెప్పనే చెప్పారు. "Love all, serve all, help ever, hurt never" (అందరిని ప్రేమించు, అందరి సేవించు, ఎల్లప్పుడూ సహాయము చేయి, ఎవరినీ నొప్పించకు) యీ మాటలను ఆచరణలో పెడుతే చాలు, ఏ వేదాలు వల్లించనవసరం లేదు. ఏ పురాణాలను చదువనవసరం లేదు. మాటకున్న శక్తి బాంబుకు కూడా లేదు. కాలు జారుతే తీసుకొనవచ్చును గాని మాట జారుతే తీసుకోలేరు. ఇది విస్మరించరాని నగ్న సత్యం.

Watch your Words
Watch your Actions
Watch your Thoughts

అన్నారు బాబా. మన మాటలకు, చేతలకు మూలం మన ఆలోచనలే. మన ఆలోచనలు పరమపవిత్రంగా వుంటే మన మాటలు, మన చేతలు వాటినే అనుసరిస్తాయి. అప్పుడు మన పలుకుతో ఎవరూ బాధపడరు, మన చేతలు ఎవరినీ నొప్పించవు. "మనసులోని యోచనా, మాటలోని సూచన, క్రియలోని ఆచరణ - మూడూ ఏకం కావాలి. అదే త్రికరణశుద్ధి" అన్నారు బాబా. కనుక మనం ఏ పని చేసినా, ఏమి మాట్లాడినా, ఏ ఆలోచన చేసినా - పదిమందిచేత "శభాష్" అనిపించుకొనే విధంగా వుండాలి. కనుక ప్రతి ఒక్కరూ ఆత్మవిమర్శన చేసుకొని సన్మార్గమున పయనించడానికి ప్రయత్నించాలి.

భక్తులు కూడా మరొక ముఖ్య విషయమును గుర్తించాలి. ఎదుటివారిలోని తప్పులను వెదకటానికే మన బుర్రను ఉపయోగించరాదు, రంధ్రాన్వేషణ చాలా ప్రమాదం. ఎవరి తప్పులను వారు తెలుసుకొని మరల ఆ తప్పులు పునరావృతం కాకుండా జాగ్రత్త పడాలి. మహాత్మా గాంధీజీ టేబులుమీద మూడు కోతి బొమ్మలు వుండేవట. ఒకటి కళ్ళు మూసుకొని, మరొకటి చెవులు మూసుకొని, ఇంకొకటి నోరు మూసుకొని ఉండేవట. వాటి అంతరార్థమేమిటి? చెడును చూడకు, చెడును వినకు, చెడును మాట్లాడకు. అయితే ఈనాడు దురదృష్టవశాత్తు వాటి అంతరార్థం మారిపోయింది. మంచిని చూడకు, మంచిని వినకు, మంచిని మాట్లాడకు అనే అంతరార్థములను తీసుకొని, వాటినే పాటిస్తున్నాడు ఈనాటి మానవుడు. అందుకోసమనే భగవాన్ బాబా ఒక పర్యాయం "See good, Do good, Be good" (మంచిని చూడు, మంచిని చేయి మంచిగా ఉండు) అన్నారు. అయితే మనం ఈనాడు భగవాన్ బోధనలను ఎంతవరకు ఆచరణలో పెడుతున్నాం? ఎవరికి వారు ఆత్మవిమర్శన చేసుకోవాలి.

ఒక పర్యాయం రమణ మహర్షి ఆశ్రమానికి ఒక భక్తుడు వెళ్ళాడుట. అక్కడ జరుగుతున్న విషయాలను గమనించి, నిరుత్సాహపడి, నీరసంగా కూర్చున్నాడుట. రమణ మహర్షి అతనివద్దకు వెళ్ళి "ఎందుకు అట్లా ఉన్నావ్?" అని ప్రశ్నించాడుట. అప్పుడు ఆ భక్తుడు "స్వామీ! తమ సమక్షంలో నే ఇన్ని అవాంఛనీయమైన సంఘటనలు జరుగుతుంటే చూచి బాధపడుతున్నాను" అని అన్నాడుట. అప్పుడు రమణ మహర్షి "ఈ దుస్సంఘటనలు మీ ఊళ్ళో జరగటంలేదా? అటువంటివాటిని చూడటానికి ఇంత దూరం ఎందుకు వచ్చావ్! వాటిని కాదు చూడవల్సింది నన్ను చూడు" అన్నారుట. కనుక భక్తులు రంధ్రాన్వేషణ కోసం ప్రశాంతినిలయం వెళ్ళనవసరంలేదు. దైవాంశ సంభూతుడైన భగవాన్ బాబావారిని చూడటానికి మాత్రమే వెళ్ళాలి.

ఈ దుర్ఘటనల వెనకనున్న అదృశ్యహస్తాలను గురించి మనం ఏమాత్రం భయపడనవసరంలేదు. వాటినన్నిటినీ ఆ జగద్రక్షకుడైన బాబాయే చూచుకుంటారు. ఆయనను రక్షించాలని తాపత్రయపడటం అవివేకం. ఆ శక్తి మనలోలేదు ప్రభుత్వాలకు ఆ శక్తిఅసలేలేదు. ఆయనను ఆయనే రక్షించుకోగలరు. ఆయనే అందరినీ రక్షించగల సర్వరక్షకుడు. అయితే ఎవరి Duty వారు నిమిత్తమాత్రంగా చేస్తూ పోతుండాలి. "Duty is God" అన్నారు బాబా. ఈ కుట్రల మధ్య అదృశ్య విష రబంధ హస్తాలమధ్య బాబా ఏమైపోతారోనని భక్తులు భయపడుతున్నారు. స్వామి దివ్యశక్తిని ఎరుగని భక్తులు భయపడుతున్నారు. స్వామి దివ్య శక్తిని ఎరుగనివారుమాత్రమే ఈ విధంగా బాధపడుతుంటారు. తమ అవతార పుట్టుపూర్వోత్తరాలను గురించి, తమ అంతరంగిక భక్తులతో పలుపర్యాయములు వివరించారు. ది 23-5-1988 నాటు బెంగుళూరులోని బృందావన్‌లో

ఇచ్చిన ఇంటర్వ్యూలో బాబాయే స్వయంగా తన అవతార విశేషాలను వివరిస్తూ, ప్రస్తుత అవతారంలో 96 సం. లకు ఉంటానని, ఒక సంవత్సర వ్యవధిలో తిరిగి ప్రేమ సాయిగా కర్ణాటకలో అవతరించి 75 సంవత్సరాలపాటు వుంటానని చెప్పారు కనుక భగవాన్ బాబాను ఈలోపు ఏ ముష్కరులూ ఏమీ చేయలేరని నా ధృడవిశ్వాసం దివ్యపురుషులు తాము అవతరించే ముందే తాము ఆ అవతార కాలంలో నిర్వహించవలసిన కార్యక్రమాలను రూపొందించుకొని, ఒక పథకమును తయారుచేసుకొని, వాటిని అమలుపరచటానికి దివి నుండి భువికి దిగివస్తారు. అదే అవతార పురుషుల విశిష్టత.

స్వామి ఒక పర్యాయం తమ అవతారతత్త్వమును గురించి, దివ్యత్వమును గురించి వివరిస్తూ "అత్యంత శక్తివంతమైన దుర్బిణీయంత్రములు కూడా చూడజాలని పదార్థములను నేను చూడగలను. నాకు ఎటువంటి ఎక్స్‌రే ఫొటోలు అవసరం లేకుండానే రోగ నివారణగావించగలను ఏడు వేల సంవత్సరములనాటి విషయములనే కాదు, డెబ్బదివేల సంవత్సరములనాటి విషయములు కూడా నాకు తెలుసు. నేను పుస్తకములను చదవను. నేను కాలములో ముందు వెనుకలకు వెళ్ళి కోరిన దేనినైనా చూడగలను. నేను దేశకాల పరిమితుల కతీతుడను" అని అన్నారు. కనుక భగవాన్ బాబావారి దివ్యశక్తిని గురించి శంకించ నవసరంలేదు. ఆయన సర్వజ్ఞుడు, సర్వవ్యాపకుడు, సర్వాంతర్యామి. మానవరూపమును ధరించిన మాధవుడే బాబా.

భగవాన్ బాబా లోగడ అనేక సందర్భాలలో భక్తుల బాధలను స్వీకరించి, వారిని రోగవిముక్తులను గావించిన సంఘటనలు కోకొల్లలు ది 29-6-1963 న శ్రీ సత్య సాయిబాబావారికి థ్రాంబాసిస్ అనే జబ్బు (మెదడులో రక్తం గడ్డకట్టుట) చేసి పక్షవాతం వచ్చి ఎనిమిది రోజులపాటు భక్తులను ఆందోళనలో ముంచివేసి చిట్ట చివరికి తానే ఆ రోగనివారణ చేసుకొని యావన్మందిని ఆశ్చర్య చకితులను గావించిన విషయం తెలియదా? గోవా సంఘటన భక్తులకు గుర్తులేదా? 1987 లో బెంగుళూరులో యు. పి భక్తురాలి గుండె పోటును స్వీకరించిన విషయం గుర్తులేదా? ది 20-8-88 న ప్రశాంతినిలయం స్నానాల గదిలో కాలు జారిపడి తొంటి ఎముక విరిగిన సంఘటన గుర్తులేదా? ఆనాడు స్వామి దివ్యశక్తి ఎంతటిదో ప్రస్ఫుటం కాలేదా? అన్నీ తెలిసి కూడా ఈ మధ్య జరిగిన దుర్ఘటనకు కొందరు భక్తులు భయకంపితులై పోతున్నారు భగవంతుని లీలలు అందరికీ అంతుబట్టవు ఈ సంఘటనలు సామాన్యుని దృష్టిలో పెద్దవి. స్వామి దృష్టిలో అవి సామాన్యములే. భగవంతుడు సాక్షీభూతుడనే నగ్నసత్యాన్ని విస్మరించరాదు.

ద్వాపరయుగంలో ఒక పర్యాయం కుంభవృష్టి కురిసిందట? ఎంతోమంది మనుష్యులు మరణించారుట, పశువులు కూడా నశించాయట దానికి తట్టుకోలేక శ్రీకృష్ణునివద్దకు వెళ్ళి వర్షమును ఆపించమని మొర పెట్టుకున్నారుట "ప్రకృతికి విరుద్ధంగా నేను ప్రవర్తించను, జరుగవలసింది జరుగవలసిందే" అని శ్రీకృష్ణుడు గోవర్ధనగిరి పర్వతాన్ని తన చిటికిన వ్రేలితో ఎత్తి, అక్కడి ప్రజలను దానిక్రిందకు రమ్మనమని చెప్పాడుట. ఆ విధంగా ఆనాడు భక్తులను శ్రీకృష్ణుడు రక్షించాడు. కనుక దివ్యపురుషుల మనోభావాలు, సామాన్యుల మనోభావాలకు అతీతంగా ఉంటాయి వాటిని అర్థం చేసుకోవటం చాలా కష్టం. అర్థంకాక వ్యర్థమైన మాటలు మాట్లాడటం పరిపాటి. ఎప్పుడు, ఏవిధంగా ప్రవర్తించాలో దివ్య పురుషులకే తెలుసు. దానిని తెలుసుకోలేక "బాబా మౌనం వహించాలేమిటి? నోరు మెదపరేమిటి?" అని అనవసరంగా మాట్లాడుతుంటారు సామాన్యులు. వారు తాత్కాలిక ప్రయోజనాన్ని ఆశించరు. శాశ్వతమైన ధర్మరక్షణే వారి లక్ష్యం. అంతిమ లక్ష్యాన్ని దృష్టిలో పెట్టుకొని

ఒక పథకం ప్రకారం నడుస్తుంటారు దివ్యపురుషులు, అవతారమూర్తులు అది అర్థంకాక సామాన్యులు తికమక పడుతుంటారు, ఒక్కొక్క సమయంలో వారి దివ్య శక్తినే శంకిస్తుంటారు ఇది సహజం.

ఈ దుర్ఘటన వార్త విని ఉండబట్టలేక జూన్ 8వ తేదిననే బయలుదేరి ప్రశాంతినిలయం వెళ్ళి వారం రోజులపాటు అక్కడ ఉండి వచ్చాను అక్కడ ఒక అమూల్యమైన విషయాన్ని తెలుసుకో గలిగినాను. స్వామియొక్క స్థితప్రజ్ఞత్వాన్ని కళ్లారా చూచాను. ఒకప్పుడు బొంబాయిలో జరిగిన పత్రికాగోష్ఠిలో ఒక విలేఖరి "స్వామీ! తమ సందేశం ఏదైనా ఇవ్వండి!" అని బాబాని అడిగారుట అప్పుడు స్వామి నవ్వి "వేరే సందేశం ఎందుకు? "My life is my message" (నా జీవితమే నా సందేశం) అన్నారుట ఆ మాటలకు అర్థం ఏమిటో, ఇప్పుడు ఇంతకాలంతరువాత బాబాను చూచి నేను అర్థం చేసుకొనినాను. ప్రశాంతి నిలయంలో బాబాను చూస్తుంటే అసలు ఆ దుర్ఘటన అక్కడ జరిగిందా? అనిపిస్తుంది. ఆ దుర్ఘటన జరిగిన మరుక్షణం నుంచే, బాబా తన దైనందిన కార్యక్రమాలలో మునిగిపోయారు. ఆ దుర్ఘటన ప్రభావం వారి మీద ఏమాత్రం పడలేదు, వారి చిరునవ్వులో, వారి పలుకులో, వారి నడకలో ఏమాత్రం తేడా కనిపించ లేదు. గీతలో చెప్పిన స్థితప్రజ్ఞుని లక్షణాలన్ని వారిలో మూర్తీభవించాయనడంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు అదే బాబా గొప్పతనం, అదే బాబా ప్రత్యేకత ఆచరణలేని ఉపదేశాలు నిష్ప్రయోజనమని బాబా ఎప్పుడూ చెబుతుంటారు. వారు ఆచరణలో పెట్టి చూపిస్తుంటారు ముష్కరుల తల్లిదండ్రులు ప్రశాంతి నిలయంలోనే ఉన్నారు మరెక్కడయినా అయితే కోపోద్రిక్తులైన ప్రజలు వారిని చితకబాది వుండేవారు పోలీసు దర్యాప్తు పేరిట నానా చిత్రహింసలు పెట్టి ఉండేవారు కాని బాబా ఆ దుర్ఘటన జరిగిన మరుక్షణంలోనే వారిని ప్రేమతో పలకరించి "బంగారు! అయిందేదో అయిపోయింది. బాధపడకండి! మీకేం ఫరవాలేదు!" అని స్వామి ఓదార్చారుట ఇది ఎక్కడైనా జరుగుతుందా! అంత దుర్ఘటన జరిగినతరువాత, ఎవరైనా ఈ విధంగా ఆ ముష్కరుల తల్లిదండ్రులను మాట్లాడించగలుగుతారా? అది బాబాకే సాధ్యమైంది ఆ ప్రేమమూర్తికే సరిపోయింది. స్వామి నిజంగా ప్రేమమూర్తి అనటానికి ఈ ఒక్క ఉదంతం చాలు. స్వామి ఆచరణకు ప్రాముఖ్యత నిస్తారు ఆచరించినప్పుడే అర్హత వస్తుంది. కనుక ఆచరణద్వారా ఇతరులకు బోధించాలంటారు బాబా. బాబా చెప్పింది చేస్తారు. చేసిందే చెబుతారు. ఇదే వారి ప్రత్యేకత. ఈ విషయంలో ఎవరికి వారు ఆత్మ విమర్శన చేసుకోవాలి. బాబా బోధనలను ఎంతవరకు ఆచరణలో పెడుతున్నాం? వాటిని ఎంతవరకు అనుసరిస్తున్నాం? ఆచరించకుండా, అనుసరించకుండా ఎన్ని పర్యాయములు పుట్టపర్తి వెళ్ళి బాబాను సందర్శించినా ప్రయోజనం ఉండదు. ప్రయోజనం లేకపోగా ప్రమాదం కూడా వాటిల్లుతుంది. ఈ వాస్తవాన్ని ప్రతి ఒక్కరూ గ్రహించాలి.

భగవాన్ బాబా నిజంగా ప్రేమమూర్తి. అయితే ప్రేమమూర్తి ప్రాంగణంలోనే ఇటువంటి దుర్ఘటన జరిగిందేమిటి? అని అర్థంకాక యావత్ ప్రపంచం నిర్ఘాంతపోతున్నది. ప్రతి అవతారకాలంలోనూ ఇటువంటిసంఘటనలుజరుగుతూవుండటం పరిపాటి అప్పుడే దుష్టశిక్షణకు, శిష్టరక్షణకు అవకాశం ఏర్పడుతుంది అయితే ఇక్కడ వివరించవలసినవిషయం ఒకటున్నది. బాబా అమితంగా ప్రేమించే విద్యార్థులలోని వారే కొందరు ఈ దుస్సాహసానికి ఒడికట్టడం కడు బాధాకరం. ప్రశాంతినిలయం విద్యార్థులమీద ఉండినటువంటి ఉన్నతమైన అభిప్రాయానికి ఈ దుర్ఘటన తీరని కళంకం. కనుక అక్కడి విద్యార్థులు ఆత్మ విమర్శన చేసుకోవాలి. భగవాన్ బాబా అనుగ్రహం సామాన్యంగా

అందరికీ దొరకదు. అలనాడు శ్రీరామచంద్రుని అనుగ్రహం కోతులమీదపడింది. చంచల స్వభావం గల కోతులు సహితం విద్యుక్తధర్మాన్ని నిర్వర్తించాయి శ్రీరామునికి అండగా నిలిచాయి రావణ సంహారంలో ప్రముఖపాత్ర వహించి శ్రీరాముని ప్రశంసల నందుకొనినాయి. ఈనాడు భగవాన్ సాయి అనుగ్రహం విద్యార్థులమీద పడింది. దానిని సద్వినియోగం చేసుకోవటం విజ్ఞతగల విద్యార్థుల కర్తవ్యం. ఇక్కడ ఒక ప్రధానమైన విషయాన్ని గుర్తించాలి ఈ కుట్రలో పిల్లలనే పావులుగా ఉపయోగించారంటే, దీని వెనుక ఎంతో పెద్ద కుట్ర వుండివుంటుందని భావించడంలో పొరపాటులేదు దాని వెనుక విదేశీ సంబంధమున్నదా? లేక స్వదేశీ సంబంధమేనా ? హంతకులను హతమార్చడానికి వెనుక ఏదైనా బలీయమైన అదృశ్య హస్తాలు వున్నాయా ? పోలీసులే హంతకులను కాల్చి చంపారా ? కోపోద్రిక్తులైన ప్రజలే ఆ సాహసం చేశారా ? ఈ సందేహాలకు సమధానం దర్యాప్తులో తేలవలసిందే గాని, మామూలుగా తేలే విషయాలు మాత్రం కావు అయితే ఈ దుస్సంఘటనను ఆసరాగా తీసుకొని నిర్వాహకులు మధ్య, ట్రస్టువారి మధ్య అంతఃకలహాలున్నాయని, భేదాభిప్రాయాలున్నాయని పత్రికలు వ్రాస్తున్నాయి. ఈనాడు సహజంగా ప్రతి సంస్థలో భేదాభిప్రాయాలు వుంటునేఉన్నాయి. లేని సంస్థఅంటూ లేదు. అయితే ఈ భేదాభిప్రాయాలకు, యీనాటి యీ కుట్రకు సంబంధం ఉండి ఉంటుందని చిత్రీకరించడానికి ప్రయత్నించడం మాత్రం అత్యంత బాధాకరమైన విషయం బాబా సంస్థలకు అపప్రదిష్టవస్తే నష్టపోయేది ఎవరు ? బాబా చేపట్టిన ప్రజాహిత కార్యక్రమాలకు అవరోధం ఏర్పడితే అపప్రదిష్ట ఎవరికి ? బాబా సంస్థల నిర్వాహకులకు కాదా? యీమాత్రం ఇంగితజ్ఞానం వారికి లేదని అభాండాలు వేసేవారు వేస్తున్నారా ? అవకాశం దొరికిందికదాయని ఇష్టం వచ్చినట్లు అభూతకల్పనలు వ్రాసి ప్రజలను అయోమయస్థితిలో పెట్టటానికి ప్రయత్నించడం ఏమాత్రం వివేకం అనిపించుకోదు. మనం వ్రాసే వ్రాతలవలన ఒక మహత్తరకార్యక్రమానికి విఘాతం కలుగరాదు.

భగవాన్ బాబా ఆధ్యాత్మికచింతనతో అంగీకరించని వారు సహితం, విద్యా, వైద్య, సేవారంగాలలో బాబా చేబట్టిన మహత్తర కార్యక్రమాలను చూచి ప్రశంసిస్తున్నారు ఒక మారుమూల కుగ్రామంలో ఇంతటి ప్రగతి జరుగుతుంటే నిజంగా బాబాను అభినందించాలిగాని, అసూయ చెంది, ఆ సమాజహితకార్యక్రమాలకు ఆటంకం, అపప్రదిష్ట వచ్చే విధంగా ప్రచారం చేయకూడదు ఒక మారుమూల కుగ్రామానికి విదేశాల నుండి వందలాది కోట్ల రూపాయలు వస్తున్నాయంటే, అది నిజంగా భగవాన్ దివ్యశక్తి ఫలితమేనని ఆనందించాలి, అభినందించాలి గాని అసూయపడరాదు బాబా చేబట్టిన యీ ప్రగతిశీల కార్యక్రమాలవలన పరిసరాల బీదప్రజలు ఎంతోమంది బాగుపడ్డారు ఆ దుర్ఘటన జరిగిన తరువాత వేలాది ప్రజలు ప్రశాంతినిలయం వచ్చి కృతజ్ఞతలు చెప్పుకున్నారు, స్వామి భక్తిని ప్రదర్శించారు. గుండె ఆపరేషన్లు ఉచితంగా చేయించుకొని ప్రాణాలను నిలబెట్టుకొనిన ఎంతోమంది బీదలు, పేదలు యీనాడు బాబాను ప్రాణదాతగా భావించి పూజించుకొంటున్నారు కనుక నేడు పుట్టపర్తిలో జరుగుతున్న ప్రగతిని ప్రశంసించాలిగాని, ఈర్ష్య పడరాదు ఆనందించాలిగాని అసూయపడధాదు.

ముఖ్యంగా ప్రస్తుత పరిస్థితులలో నిర్వాహకులు కడు జాగరూకతతో వ్యవహరించాలి విమర్శనలకు ఆస్కారం యివ్వకుండా ప్రవర్తించాలి మన మాటలు, మన చేతలు, మన తలంపులు పదిమందికీ ఆమోదకరంగా ఉండే రీతిలో ఉండాలి నిర్వాహకుల ప్రవర్తన ఉండవలసిన రీతిలో ఉండకపోతే, శత్రువులు పన్నిన కుట్రవలన వచ్చే నష్టం కన్నా, అపప్రదిష్టకన్నా, నిర్వాహకుల వలననే సాయి సంస్థలకు ఎక్కువ నష్టం వాటిల్లుతుందనే నగ్నసత్యాన్ని గుర్తించాలి, వర్తించాలి

అనుమానం పెనుభూతం, అవమానం అన్ని అనర్థాలకు హేతువు "సంశయాత్మా వినశ్యతి" అన్నది భగవద్గీత. సంశయములు కలవాడు నశించిపోతాడు. కష్టాలు వచ్చినప్పుడు, ఆపదలు సంభవించినప్పుడు సంశయాలు ఉత్పన్నం కావడం సహజం. వాటిని పారద్రోలగలుగుతే వివేకం తల ఎత్తుతుంది. వివేకంతో సరియైన ఆలోచన చేయగలుగుతాం. ఒక్కొక్కప్పుడు బాధలనుండే బోధలను గ్రహించగలుగుతాం. కష్టాలలోనే జ్ఞానోదయం అవుతుంది. ప్రచండ దుఃఖంలోనే తన అస్తిత్వాన్ని గుర్తించగలుగుతాడు మానవుడు. కనుక వివేకంతో, విజ్ఞతతో, ఓర్పుతో, ఓర్మితో, సహనంతో ఈనాడు సంభవించిన ఆపదనుండి బయటపడటానికి భక్తులు ప్రయత్నించాలి.

ఒక పర్యాయం భగవాన్ బాబావారు ఒక చక్కని ప్రవచనం చేసారు. అది ఈనాటి ప్రస్తుత పరిస్థితులలో మనకు మనోధైర్యాన్నియిస్తుంది. "ఆధ్యాత్మిక సాధనకు ఎన్నో అవరోధములు వచ్చుచుండును. వానిలో ముఖ్యమైనది ఏదనగా శాస్త్రజ్ఞాన శూన్యులు సాధకుని చుట్టూ చేరి, కుటిల ప్రశ్నలు, కుటిల విమర్శలు ప్రారంభించుదురు. తరువాత ఆక్షేపణలోనికి దిగి, తుదకు ఎత్తిపొడుపులతో, హేళనలు, దూషణలు కూడా చేయుదురు. నీవు వాటిని చెవిని పెట్టకూడదు. చెవిని పెట్టినను చలింపకూడదు. వారు అసూయ అహంకార పూరితములయిన, సాంఘిక వ్యవహారములందు మాత్రమే ప్రవీణులు. వారికి సినిమా తారల చరిత్రలేగాని సాధకుల చరిత్రలుగాని, యోగుల చరిత్రలుగాని, పరమహంసల చరిత్రలుగాని తెలిసియుండవు. అట్టివారేమన్న నీకేమి ?" అని స్వామి చెప్పారు. కనుక ప్రస్తుత పరిస్థితులలో భక్తుల కర్తవ్యమేమిటో అర్థం చేసుకొని, భగవాన్ బాబావారి మాటలను ఆచరణలో పెట్టి కర్తవ్యపరాయణులవ్వాలి.

"కనుల కగుపడు దృశ్యంబు గాంచి మీరు
సత్యమిది యని యెంచగ సంబరమున
తెరను దాగిన సత్యంబు తెలిసికొనగ
విశ్రమింపక నాతోడ వెడలిరండు"

అన్నారు బాబా. సత్యరూప తత్త్వాన్ని తెలిసికోవటానికి తమ వెంట తరలిరండని మనల్ని ఆహ్వానిస్తున్నారు బాబా. కనుక బాబా చెప్పిన మాటను శిరసా వహిద్దాం. వారు చూపిన బాటన నడుద్దాం. అప్పుడు అంతిమ విజయం సత్యానిదే. ఇదే ఈనాటి మన కర్తవ్యం.

## మనవి

1993 మే నెలలో బృందావన్‌లో జరిగిన వేసవి తరగతులలో భగవాన్ బాబావారి దివ్య ప్రబోధలు జూన్ '93 శ్రీవాణి సంచిక నుండి ప్రారంభించినాము. కనుక క్రొత్త చందాదారులు త్వరపడండి! తమ చందాలను వెంటనే పంపి వేసవి తరగతుల ప్రసంగాలను స్వంతం చేసుకోండి!

భగవాన్ బాబావారి జన్మదినోత్సవ సందర్భమున నవంబర్ '93 శ్రీవాణి సంచికతోపాటు శ్రీ సత్యసాయి శతకము (ప్రథమ భాగము) అనే పుస్తకము ఉచితంగా చందాదారులందరికి పంపబడును. స్వామి అప్పుడప్పుడు ప్రవచించిన పద్యాలు, దానికి వ్యాఖ్యతో పుస్తకం తయారవుతున్నది. శ్రీవాణి చందాదారులకు మాత్రమే ఉచితంగా పంపబడును. విడిగా అమ్మబడవు. కనుక క్రొత్తగా చందాదారులుగా చేరి ఈ సదవకాశమును వినియోగించుకోండి. చందాలు రెన్యూవల్ చేసిన వారికే ఈ పుస్తకం పంపబడుతుంది. కనుక రెన్యూవల్ చేయవలసినవారు కూడా వెంటనే తమ చందాలను రెన్యూవలు చేసి ఈ సదవకాశమును వినియోగించుకో ప్రార్థన. - సం.

(8 వ పేజీ తరువాయి)

వేయి సంవత్సరాలైనా దేవతలు రాలేదు, ఆయుధాలను తీసుకోలేదు. అవి చెడిపోయే ప్రమాదమొచ్చింది. దధీచి వాటిని మంత్రజలంతో కడిగి, నీరుగా మార్చి, పానం చేసాడు. ఆ ఆయుధ శక్తులన్నీ ఈ విధంగా ఆయన అస్థికలలో జీర్ణమయ్యాయి. వాటి తేజం ఎముకలకు పట్టింది. కనుకనే ఆ ఎముకలను పొందమని నారాయణుడు దేవతలకుద్బోధించాడు.

తదనుగుణంగానే, వ్యాసం మొదట్లో చెప్పినట్లు, దేవతలు ఇంద్రుని ఆధ్వర్యంలో దధీచిని కలసి, వారి శరీరదానాన్ని అర్థించారు. వారిని చూడగానే కుదువ బెట్టిన అస్త్ర, శస్త్రాలకోసం వచ్చారనుకున్నాడు దధీచి. జరిగిన సంగతి వివరించాడు. వారు అయుధాలకోసం తాము రాలేదని, అస్థికలర్థించేందుకొచ్చామని చెప్పారు.

వెంటనే దధీచి సమాధిలో కూర్చున్నాడు. "నేనీ అనిత్య శరీరాన్ని త్యాగం చేసి, దానికి బదులుగా నిత్య వస్తువును ప్రాప్తింపజేసుకున్నాను. క్షణ భంగురమగు దేహాన్ని త్యజించి, అవినాశియగు పరమును పొందుతున్నాను" అంటూ కళ్ళు మూసి పక్కకు ఒరిగాడు. దేవతల ఆనందానికి అంతు లేదు. దధీచి చేసిన యీ అపూర్వ త్యాగానికి ఆకాశం నుండి పుష్ప వర్షం కురిసింది. గోవుల నాశ్రయించి ఎముకలను శుద్ధిపరచుకొని, విశ్వకర్మ కందించి అజేయమైన వజ్రాయుధాన్ని, ఇతర శస్త్రాలను తయారుచేయించుకున్నారు.

(సశేషం)

# కష్టాలు భగవంతుడు కల్పించినవే

కప్పుల ఆంజనేయశర్మ

శ్రీరామచంద్రుడు వనవాసం చేస్తున్న రోజులవి. ఒకరోజున అతనికి దాహం వేసింది. నీళ్ళకోసం ఒక చెరువు దగ్గరకు వెళ్ళబోతూ, తన విల్లుని భూమిపై గ్రుచ్చివెళ్లాడు. నీళ్ళు త్రాగి తిరిగివస్తూ తన విల్లును తీసుకొనబోతుండగా దాని క్రింద ఒక కప్పనుచూశాడు. తెలియక జరిగిన తప్పుకు మిక్కిలి బాధపడుతూ ఆ కప్పతో 'ఓ కప్పా! నేను భూమిలో విల్లును గ్రుచ్చినప్పుడు నీవు కొంచెము అలజడి చేసినా, కొద్దిగా బెకబెకమని శబ్దం చేసినా నేనీ తప్పును చేసియుండేవాణ్ని కాదు కదా! నీకీ ఆపద వచ్చియుండేదీకాదు.' అన్నాడు.

ఆ మాట విన్న కప్ప "రామచంద్రా! నాకు ఇతరులచే ఆపదలు కలుగునప్పుడు నిన్ను రక్షించమని వేడుకుంటాను. కాని భగవంతుడవైన నీవే నన్ను బాధించిన నేనెవరితో మొరబెట్టుకుంటాను. నేను చేయవలసినది లేదని ఊరకున్నాను" అంది.

ఈ ప్రపంచంలో కష్టాలు పొందువారు మిక్కిలి శ్రమ పడుచున్ననూ, ఇవి అన్నియు భగవంతుడు కల్పించినవే అని భావించి, నిరాశ, నిస్పృహలు చెందక ఓర్మితో ఉంటారు.



## అధిక దిగుబడికి స్వచ్ఛమైన
## సోనా, రాజా ఎరువులను వాడండి!

ఎరువుల ప్రపంచములో సోనా, రాజా ఎరువులు
మిక్కిలి ప్రసిద్ధిగాంచినవి. వీటిని వాడి ధాన్యమును,
కూరగాయలు, పళ్ళు మొదలగు పంటలను అధికోత్పత్తిని
గాంచి అత్యధిక లాభములను సంపాదించండి!
సరియైన సమయంలో సరియైన మోతాదులు వాడండి!

**సోనా** ఎరువునందు కాల్షియం, అమ్మోనియం, నైట్రేటు,
మరియు 25% నత్రజని కలదు.

**రాజా** ఎరువునందు అమ్మోనియా సల్ఫేట్ కలదు.
ఇందులో 20.6% నత్రజని కలదు.

**సోనా** ఎరువు స్టీల్ అథారిటీ వారి అత్యాధునికమైన
రూర్కెలా కర్మాగారములో తయారు చేయబడుచున్నది.

**రాజా** ఎరువు రూర్కెలా, భిలాయి, దుర్గాపూర్ మరియు బొకారో
ఉక్కు కర్మాగారములలో తయారు చేయబడుచున్నది.

**సోనా** ఎరువు 50 కి.గ్రాముల గోనె సంచులలో లభ్యమగుచున్నది.

**రాజా** ఎరువు 50 కి.గ్రాముల మరియు 100 కి.గ్రా. ప్లాస్టిక్
సంచులలో లభ్యమగుచున్నది.

**స్టీల్ అథారిటీ ఆఫ్ ఇండియా లిమిటెడ్**
(ఎరువుల విభాగము)
సెంట్రల్ మార్కెటింగ్ ఆర్గనైజేషన్, కలకత్తా.
రీజనల్ ఆఫీసు : సికింద్రాబాద్
ఏరియా ఆఫీసులు : సికింద్రాబాద్, విజయవాడ, విశాఖపట్టణం.

KRIMS